# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 రాజమహేంద్రవరము 1-1-1981 సంచిక 5

Jan '81 to June 81 Missing 1st to Jan

—* ఈ సంచికలో *—



16—1 81 సంచికలో రాయప్రోలువారి సాహిత్యంలో నవ్యత, కవులు చిత్రించిన సత్యభామ, వీరాభిమన్యుడు - ఏకపాత్రాభినయం, శ్రీనాథుని శివాద్వైతం మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా :
సంవత్సరమునకు రు. 12—00.
అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై.

# ★ సమాలోచన

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T J College, Rajahmundry

సంపుటము 4 రాజమహేంద్రవరము 1-1-1981 సంచిక 5


## శ్రీ వీరేశలింగం పంతులుగారిని గూర్చి సరిక్రొత్త పరిశోధన గ్రంథం


— శ్రీ దిగవల్లి వేంకటశివరావు, బి ఏ, బి.ఎల్


అమెరికా దేశ యువకుడైన జాన్ గ్రీన్ ఫీల్డులియోనార్డు విస్కాన్సిన్ విశ్వవిద్యాయంలలో తెలుగును, చరిత్రను అభ్యసించి 1965-68 సం మధ్య మనదేశంలో పర్యటించి వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్ర సంపుటములు వారి గ్రంథములు, డైరీలు, లేఖలు మాత్రమే కాక ఆ కాలంనాటి పత్రికలు గ్రంథాలు, ప్రభుత్వ రికార్డులు మిషనరీల రికార్డులు, ప్రయివేటు రికార్డులు పరిశోధించి 450 పావురావుసైజు పుటల థీసిస్ గ్రంథమును రచించి విస్కాన్సిన్ యూనివర్సిటీ వారి వల్ల 1970 వ సంవత్సరములో పిహెచ్ డి పట్టము పొందియున్నాడు

లియోనార్డుగారి గ్రంథము ఇంకా ముద్రింపబడలేదుగాని దాని మైక్రోఫిల్మ్ ఫొటో కాపీలను కోరిన వారికి విశ్వవిద్యాలయము వారు ఖరీదుకు ఇస్తున్నారు

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయములో సి పి బ్రౌను రిసెర్చి ప్రాజెక్టులో సీనియరు ఆఫీసరుగా పనిచేస్తూ కొన్ని అపూర్వ గ్రంథములు ప్రకటించిన శ్రీబంగోరీగారు లియోనార్డు గ్రంథము యొక్క పూర్తి పాఠమునకు మైక్రోఫిల్మ్ కాపీ తెప్పించినారు. అది చదవగా పంతులుగారి స్వీయచరిత్రలోను వారిని గూర్చి ఇంతవరకు రచింపబడిన గ్రంథాలలోను అనేక అంశాలు అతిశయోక్తులలోను అసత్యములతోను నిండియున్నవని స్పష్టపడుతున్నది

"వీరేశలింగముగారు తమ స్వీయ చరిత్రలో జీవిత వృత్తాంతాన్ని తమ స్వంత దృక్పథంలో గ్రంథస్థం చేశారు.

ఆయన తమ మహదాశయాలు పూర్తిగా సఫలత చెందని ఒక మహాపురుషునిగా తమ్ము చిత్రించుకొన్నారు (పుట 370) సంఘసంస్కరణలో ఇతర సంస్కర్తలతోను, తమ ప్రత్యర్థులతోను, తమకుగల సంబంధాలను గురించి, తాము చేసిన కార్యసాధనను గూర్చి, వివరించారు స్త్రీ పునర్వివాహం ఉద్యమమంతా కేవలము తమ సొంత Inspiration దివ్యావేశమువల్లనే ఆరంభమై, తమ మార్గదర్శకత్వకము క్రిందనే కొనసాగినదని, విద్యాభివృద్ధికృషి, మత, సంఘసంస్కరణకృషి, ప్రత్యేకసంస్థలస్థాపనము, అన్నీ తామే ప్రారంభించినామని కొనసాగించినామని, ఇదంతా కేవలము దైవసంకల్పముతోనే జరిగించినామని స్వీయ చరిత్రలో వ్రాసుకొన్నారు. పుట (270) తాము స్వశక్తివల్లనే స్వయంకృషి వల్లనే పైకి వచ్చినామని తమ గొప్పదనమును నాయకత్వమును ఇతరులు వెంటనే గ్రహింపలేకపోయినా మొదటినుండీ ప్రదర్శితమవుతూనే వుందనీ, దురభిమానమును, మూఢత్వమును ప్రతిఘటించిన తమవిశిష్ట వ్యక్తిత్వమును గూర్చి వీరేశలింగముగారు పేర్కొన్నారు. తమ వ్యక్తిగతమైన కృషినిగూర్చి పంతులుగారు మాటిమాటికి నొక్కి చెప్పుతారు ఇతరులు తమకు తోడ్పకపోవటం అలావుండగా తమపనికి అడ్డుగా వుండేవారని వ్రాయడంలో అహంభావం కనబడుతుంది.

(పుటలు 367-372)

వీరేశలింగముగారు తమ స్నేహితులను గురించి, తమతోడి కార్యకర్తలనుగురించీ, చాలా తేలికగా వ్రాస్తారు. బసవరాజు గవర్రాజుగారివలె తమకు దాసానుదాసులైన వారినిగూర్చి తప్ప ఇతరులనుగూర్చి ఏవిధంగానూ, ప్రశంసింపరు. వారిపనిపాటులు నిరసిస్తారు. స్నేహితులను విరోధులను గూర్చి ఆయనచేసే చిత్రణము అతి విచిత్రముగా ఉంటుంది.

స్వీయచరిత్ర రెండవభాగములో ఆశాభంగం చెందిన మహావీరపురుషునిగా తమ్ము చిత్రించుకున్నారు. అందులో అసంతృప్తి, బాధ ఒకవిధమైన విచారము కనబడుతుంది. తమ భవిష్యత్తు

గూర్చి ఇతరులేవిధంగా భావిస్తారో అనే ఆందోళన కనబడుతుంది. (చూడుడు పుటలు 367-372)

వీరేశలింగముగారి సంఘసంస్కరణోద్యమం నాయకత్వం విడిగా, ప్రత్యేకంగా సాగిన దైవప్పటికీ నేనొక్కడనే, వ్యక్తిగతంగా సంఘ సంస్కారములను సాధించినా నని ఆయన స్వీయ చరిత్రలో ఉద్ఘాటించినప్పటికీ నిజానికి రాజమహేంద్రవరంలో అనేక సంస్థలయొక్క, వ్యక్తులయొక్క, కృషిమీదనే అక్కడి సంఘ సంస్కరణ మాధారపడినది ఉదాహరణానికి ప్రభుత్వకాలేజీ మిషనరీ పాఠశాలలు మునిసిపల్, రాజకీయాలు, ఇవన్నీ కూడా ఇందులో పాత్ర వహించినవి శ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారువంటి ఇతర పెద్దమనుష్యులు చేసినకృషి సామాన్యమైనదికాదు వీరేశలింగముగారి జీవిత చరిత్రలు రచించినవారు ఆయన నొక మహాపురుషునిగా చిత్రించడం అలవాటు అయిపోయినది. (పుటలు 400)

విశాల దృక్పథంతో స్థానిక ప్రాంతీయ, జాతీయపరిస్థితుల, సంస్థల, వ్యక్తుల పాత్రల పరస్పర ప్రభావము, (Inter Play) మొదలయిన విషయాలను దృష్టిలో నుంచుకొన్నప్పటికీ సంఘసంస్కర్తగాను, నాయకుడుగాను పంతులుగారిలో లోటుపాటు లున్నా ఆయనకు అపజయాలు కలిగినా, ఆయన సాధించిన కార్యములు మొత్తముమీద గణనీయములే

ఆనాటిస్థానిక రాజకీయాలలోని సంఘ జీవితములోని తికమకలు ఆయన జీవిత చరిత్రలో ఆసక్తికరముగా ప్రతిఫలిస్తూవున్నవి. సంఘసంస్కర్తగా విద్వాంసుడైన రచయితగా ఆయనచేసినకృషి ఇప్పటికినీ వాగ్వాదములకు, చర్చలకు దోహదకారిగానే ఉన్నది.

"వీరేశలింగముగారి జీవితమునుగూర్చి వారి చరిత్రనుగూర్చి వ్రాసినవారు ఆయన స్వీయచరితలో ఆయన వ్రాసిన సంగతులను అంశాలను ఎట్టి పరిశీలనా లేకుండా, ఆనాటిపత్రికలు ప్రభుత్వమిషనరీ రికార్డులు మొదలైన వాటిలోని సంగతులతో పోల్చి చూస్తే అందలి నిజానిజములు ఏమిటో నిర్ణయించకుండా, స్వీకరిస్తారు ఆయనకృషిలో ఆయనకు కలిగిన ఆటంకాల నెలా నిగ్రహించినదీ వ్రాయరు ఆయనకు ఎవరు సహాయంచేసినదీ పరిశీలింపరు అన్నిటికన్న ముఖ్యముగా ఆయన తాను సాధించినట్లు వర్ణిస్తూచేసిన ఉద్ఘాటనలకును సాక్షాత్తుగా సాధింపబడన కార్యములకును గల తారతమ్యము గమపరు' అని లియోనార్డు వ్రాసినాడు

(చూ 1 ప్రకరణము పు 13 15)

—(*)—

# గాథా సప్తశతిలోని ఋతువర్ణనలు

- శ్రీ కే కిశోరుబాబు, ఎం ఏ
- శ్రీ కే. అశోకబాబు, బి ఎస్‌సి (అగ్రి)

ప్రాకృతభాషలో హాలచక్రవర్తి సంతరించిన గాథాసప్తశతి తెలుగుగడ్డపై వెలసిన తొలి కవితా కదంబము. అది 'ప్రాకృత కవితాసంకలనమైనను దాని యందు అమాయికమైన అమలినమైన తెలుగు జానపదుల జీవితము కరివేపాకువలె కొత్తిమేరవలె గమగమ, గుమ గుమ పరిమళించినది. ఖరుజు తేనెవంటి కమ్మటి వర్ణనల కది ఆటపట్టు భారతము ప్రతి పద్యము రసాస్పదమైనట్లు అది ప్రతి పద్య రసాస్పదము ఉల్లములను కడిమి చెట్టువలె పులకింపజేయగల షడృతువర్ణనలను కొన్నింటిని హాలుడు తన సప్తశతియందు ఏర్చి కూర్చినాడు ప్రస్తుతము వాటిని గమనింతము

ఋతూనాం కుసుమాకర అని ఋతువులలో వతంసమైనది వసంతమని శ్రీకృష్ణ భగవానుడు పేర్కొనినాడు తెలుగు కవులందరకు ప్రాణమువలె ప్రీతిపాత్రమైన ఋతు వది ప్రాచీనులు మొదలుకొని అర్వాచీనుల వరకు తెలుగుకవులందరు ఏదో ఒక సందర్భమును పురస్కరించుకొని దానిని తమ కవితాసింహాసనముపైఅధిష్ఠింపజేసి దీనార టంకాల తీర్థమాడించినా రని తెలుపుట అతిశయోక్తికాదు చిగురు చిగురున రాగశీకరము లొలికించుచు ఆకు నాకున మరకతాకృతులు పలికించుచు పూవు పూవున మధువుల పొంగించుచు సర్వప్రకృతిని వియచ్చరవలె మార్చి మనోవీణలను ఝుణఝుణ మని మ్రోగించగల భాస్వంతమైన ఋతువది. సప్తశతిలోఈ ఋతువును వర్ణించు గాథలు మందారముల వలె మంకెనలవలె మాణిక్యలముల వలె సంజలలోసాగే మబ్బులవలె వేడుక గొలుపుచుండును

వసంతసార్వభౌముడు వేంచేస్తున్నాడను మేలివార్తను తెలుపు కమ్మను గొని వచ్చు చున్నట్లు పిల్లతెమ్మెర యూడుగు తలిరుగొని విలాసముగా పల్లెతెరువు లందు పయనించుచున్నదట రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ పుట (37) మామిడి చిగురాకు నెత్తుట దోగి కాముని చెయి బాకువలె నున్నదట (శా.గా స. సా.రా అ కృ శ పుట 109) పెందామర పూవుల చిందిన మకరంద బిందువుల గ్రోలుచు ఝుంకృతు లొనర్చు తేంట్లు తెట్టువ వసంతశ్రీ కటిమండలమున చలించెడు నీలిమణుల మొలనూలువలె మినుకు మినుకు మనుచున్నదట (శా గా స సా రా అ కృ.శ పుట 107) రాయశేమో వసంతవర్ణనలో తుమ్మెదలను 'అభిసారికాంశుకోద్యన్నీల గుళికలుగా' భావించినాడు

శిశిర మందు కారుచిచ్చుకు కాలినశించి మరల ఆమని దయ వలన పునర్జన్మించిన

మోదుగు ముంగిస చెవులను బోలిన లేలేత చివురాకులతో కన్నులపండువొనరించుచున్నదట (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 138) ధరాతలమందు వఱదవారిన మోదుగుపువ్వుల దొంతర తథాగతుని చరణములకు చెంగనాలొనరించు బౌద్ధభిక్షుగణములవలె చెంగలించుచున్నదట (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 61) కింశుకపల్లవములను సుమములను పరుచనై కించిత్తు అరుణిమ కలిగి దొప్పవంటి ఆకారము గలిగిన ముంగిచెవులతోను కాషాయాంబరధారులైన బౌద్ధులతోను ఉపమించుట కడుంగడు ప్రశంసనీయముగా నున్నది విద్యాకరులకే సాక్ష్యము లగు మనోహర అధ్యాహారములవి. ఈపోలికల వలన ఆనాటికవులు తమ చుట్టుముట్టు సమాజమునందలి తిర్యక్కులను వ్యక్తులను జ్ఞానచక్షువులతో నిపుణముగా పరిశీలించి వాటిని ఉపాదానములుగా ఉపమానములుగా స్వీకరించి తమ కవితలందు పసిడి ఉంగరమున పొదుగు రత్నములవలె వాటిని శోభాకరముగా ఔచిత్యవంతముగా పొదుగుకొనుచుండెడివారని తెలియుచున్నది. కృష్ణదేవరాయలు మోదుగును కొడవలితోను, కాళిదాసు నఖక్షతములతోను, మరొక కవి చిలుకముక్కుతోను సామ్యము కల్పించి వర్ణించినట్లు మన సంస్కృతాంధ్ర కావ్యములలో కన్పించుచున్నదిగాని ఈ గాథాకారుల వలె నవనవోపమానములను సృష్టించి వర్ణించిన వారు తక్కువ.

కోటి దివిటీలు భగ్గుమన యక్షగానములోని రాక్షసుట్లు హుమ్మని ప్రవేశించి జనకోటి గుండెలను తెం తెకలాడించు భయంకర ఋతువు గ్రీష్మము మార్తాండుని అఖండిత ఖరకరములను మల్లికల సార్ద్ర పరిమళములను సమానముగా చవిచూపి కష్టసుఖములు రెండింటిని గుర్తుకు దెచ్చు ఋతు విది. ఈ వేసవి సెగలను గాథాసప్తశతి అత్యంత సహజముగా చిత్రించి చూపినది, గ్రీష్మాటోపమునకు అలసి సొలసి కళ్ళుకానరాక దున్నపోతొక్కటి కొండసెలయేరని బ్రమసి పాము మేనును గోముగా నాక దొడిగినదట దున్న నోటినుండి కారు చొల్లును ఆదరాబాదరాగా త్రాగుతూ పాము దాని నొక నల్లరాతి యూటగా భావించినదట (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 103) పర్వతసమీపమున గల సర్పనిర్మోకమును గని మదగజము తెలివాకయని మాటిమాటికి కరమును తడుప జూచుచున్నదట (శా.గా.స.సా.రా. కృ.శ పుట 117) భ్రాంతిమదలంకారమున రచింపబడిన ఈ రెండుముక్తకములు అత్యంత రమణీయములుగా నున్నవి. కృష్ణరాయలు గూడా వేసవిలో పెనుకసటు రేప అందు పల్లటీల్గొట్టు పండుటాకులను జూచి పావురాలని డేగలు వాటిని వేటాడ ముందు కురికినవని 'సురగాలి దవదగ్ధ తరుపర్ణతతి రేప బావురాలని డేగపదుపు దూరె' అని భ్రాంతిమదలంకారముననే వర్ణించినాడు! మండు టెండలకు బిత్తలయిన చెట్టుచేమలన్ని అతితారముగా కీచునాద మొనరించు నీలిపురువుల రొదచేర ఆలగోడు బాలగోడు మంటున్నట్లున్నవట (శా.గా.స.సా.అ.కృ.శ పుట 93) గ్రీష్మాసురునిచేత మానభంగము గావింపబడి స్థాణువులైన వృక్షములు నీలిపురువుల గొంతులచేత హృదయవిదారకముగా రోదన మొనరించుచున్నట్లువన్న కల్పన సహజముగా నున్నది. కఱకు టెండ దెబ్బకు వెఱచి మనిషినీడ కూడా గిటకనై మేని క్రిందికి నొరిగి యించుకంతయు వెలుపలికి రాక ప్రక్కన పేనువలె అణగిమణగియున్నదట (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 10) ఆతపభీతికి విస్తరింపక మ్రాకులనీడలు వాటి మూలములందే దాగియుండెనని వేసవికాలమునందు వామనముగా కన్పించు వృక్షచ్ఛాయలను నన్నెచోడదేవుడు వర్ణించినాడు! బహుశః అతని భావమునకు భిక్ష పెట్టినది ఈ ప్రాకృతగాథయే అయియుండవచ్చును! వడగాలులకు అదరి గృహిణులందరు తలుపులను మూసుకొని లోపల తిరుగళ్ళను విసరుచు రొట్టెలకు పిండి తయారుచేసుకొనుచున్నారట. ఈ సన్నివేశమును గాథాకారుడు వెట్టకారుకు దిగులుచెంది వాకిళ్ళు కళ్ళుమూసుకొని ఇళ్ళు గఱగఱమను తిరుగళ్ళ చప్పుడను గుఱకలతో కూర్కుచున్న కరణినున్నవని వర్ణించినాడు (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 140) అలనాటి సాంఘిక జీవితమును ప్రతిబింబింప జేస్తూ పసిడికడ్డివలె నిగ్గులొలుకుచున్న పద్య మిది.

జాతి క్రొవ్విరులకు, సకలసస్యములకు, నాణిముత్యములకు, నాపగలకు, నెమ్మినటనములకు, నేరేడుపండ్లకు, నెలవైన సుందర ఋతువు వర్షము. దాని వన్నెచిన్నెలు గాథాసప్తశతియందు హృద్యముగా వివరింపబడినవి. ఉడుగని జలధారల నేడు నిడువు త్రాళ్ళను గట్టి, పుడమిని పైకీడ్వలేక డస్సి దీనముగా వెంత్రుకొను గతిని మొగులు ఉరిమినదట (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 85) ఇంద్రచాపపు గొడుపుతో నెత్తి పొడువగా, నొప్పినోర్వక బిట్టుగ రొప్పుచుండు మొగిలనెడు కారుదున్న కడుపున వెడలి వ్రేలుచుండెడి వ్రేగువలె నున్నదట మెరుపు (శా.గా.స.సా.రా.అ.కృ.శ. పుట. 109) తటిల్లతకు దున్నకడుపులోని ప్రేవునకు మును పెవ్వరును ముడిపెట్టనంత సొగసుగా ముడిపెట్టి వర్ణించి దాని తళతళను మన కన్నులముందుంచినాడు గాథాకారుడు! వర్షర్తులక్ష్మీ పయోధరములు తనువు సోకగా కనిపించు పులకాగ్ర కంటకవితానమో యను నట్లు వింధ్యశిఖరి సన్నిదెసల పచ్చిక మొలచినదట (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 108) పయోధరశబ్దమునకు మేఘములు స్తనములు అను అర్థద్వయము

గలదు. పయోధర శబ్దము ప్రయోగించి కవి ఈపద్యమందు మెరపించిన చమత్కృతి గమనింపదగినది. క్రొత్తగా మోసులెత్తిన ఈపచ్చిక కాటుకవడిన మోవివలె పశువుల పంటికి పట్టువడుట లేదట (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 141) తృణాగ్రకంకణములు పచ్చరాతి సూదిని గ్రుచ్చిన నవమౌక్తికములవలె మిలమిలమనుచున్న వట. (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 78) ముక్కులనుండి వాన సోనలు బొట్టు బొట్టుగా కురియుచుండ కుత్తుకలు క్రుంగి రెక్కలం కదిసి వ్రేలాడ కంచెలమీదనున్న కాకులు శూలమెక్కించినట్లుగా నున్నవట (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 105) స్వభావోక్త్యలంకారములో వానకు తడిసిన కాకుల దీనస్థితిని ఈపద్యమతి చక్కగా తెలుపుచున్నది. కృష్ణరాయలు గూడా వర్షమునకు తడిసి గూళ్ళలో జాలిగొలుపునట్లుగా నుండు పక్షుల దయనీయస్థితిని ఈవిధముగానే 'తడితల డిగ్గి ముంప జడతం దుదిరెప్పల (అముక్త 4-128) యని స్వభావోక్త్యలంకారములో చిత్రించి చూపినాడు.

వానకారు విరహులకు ఫుండువలె మిక్కిలిబాధాకరమైనది. రొంపిముక్కిని దున్ని విసుగుజెంది హాయిగా కునుకుచున్న మగనిం జూచి కాపుటిల్లాలు అయ్యో పాడు వానకాలము వచ్చి మాదాంపత్య సుఖమును చెరచినదే యని దానిని శపించుచున్న దట (శా.గా.స.సా.రా.అ.కృ.శ. పుట 64) (పావృట్కాల నవజీమూతములను జూచుచు భర్తమనిలో మెదల చిక్కి శల్యావశిష్టమగుచున్న కోడలిని అత్తగారు సుతుపాలి సంజీవనౌషధమని గాసి బడకుండ కంటికి రెప్పవలె కాచుచున్న దట, (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 66) మిద్దెబంగలనుండి పొటుకుపెట్టి తడిసిన యింట ఒకపాంథగృహిణి భర్తరాక కొరకు ఎదురుచూసి ఎదురుచూసి చివరకు నిరాశయే తోడుకాగా కన్నీటివెల్లువల ద్వారా తనకు తెలియకుండానే ఆయింటిలో వానకు నానని భాగములను కూడా నాన్చివైచిన దట (శా.గా.స.సా.రా.కృ. పుట 104) క్రొత్తగా పెళ్ళయిన ఓ మీసాల నూత్నయువకుడు, కోడెగిత్త వంటివాడు, గర్జిస్తున్న ఘనాఘనమువైపు మరలి – ఇనుపగుండె గలవాడను. సత్తువయుం నీలావును నాపై చూపెట్టుముకాని సుమకోమలి, అబల, యగు నాచెలిపై చూపించి చంపకుల దని గుర్వృత్తుకన వేడుకొనుచున్నాడట! (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 106) పరదేశమున పనులు ముగియకున్నను నిజపత్ని పొందు కొరకు ఉవ్విళ్ళూరుతూ గుటకలు మ్రింగుతూ వాడావుడిగా స్వదేశోన్ముఖున్ముఖుడైన అధ్వగుని జూచి వర్షాకాలము కొండమల్లి పువ్వులవలె నవ్వులను విరజిమ్ముచున్న దట (శా.గా.స.సా.రా.అ.కృ.శ 101) పల్లీయులకు ఎడపడప గలుగు ఎడయికలను వాటివలన వారుపడు నిడుములు ఈవర్షఋతువు నెపమున గాథాసప్తశతిలో యథార్థముగా వర్ణింపబడినవి.

వాగ్దేవిధవ్యరూపమువలె మహారంగనాయకుని దేహప్రభవలె, వియద్గంగవలె, ఐరావతగజమువలె, వేల్పుగిడ్డివలె, నందీశ్వరునివలె పరమ మనోహరమైన ఋతువు శరత్తు. వసంతమువలెనే కవుల చేత కప్పురపుటారతులను పట్టించుకొన్న మేటి ఋతు విది. సప్తశతిలోని శరద్వర్ణనలు శరత్తువలెనే పరవశింపజేయుచుండును. వర్షాకాలమున పూర్ణగర్భిణులవలె నిండుగా కనిపించు బలాహకములు శరత్తున ఏకినట్టి దూదికుప్పలవలె, ఉప్పుగుట్టలవలె, శుభ్రకాంతులను వెదజల్లుచు వలిపములవలె, కనిపించుచున్న వట (శా.గా.స.సా.రా.అ.కృ.శ 123) భూదేవి శిరమున పలితకేశమువలె రెల్లు పొటమరించిన దట (శా.గా.స.సా.రా.అ.కృ.శ. పుట 85) వెలుపలవేడి లోపల చలువ గలిగిన సజ్జనులవలె సరసులు వెలుగొందుచున్న వట (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 28) ఉపమాలంకార సమన్వితమైన ఈపద్యము మానసోల్లాస కరముగా నున్నది యోగివరుల చిత్తములవలె సలిలము నిర్మలమై యొప్పారిన దని వెన్నెలకంటి సూరన విష్ణుపురాణమున ఈప్రకారముగానే శరదృతువులందలి పెనుగొలకులను వర్ణించినాడు! చక్కగా దంచినట్టి సన్నబియ్యపు వన్నెవలె వెన్నెలలు నేల నాలుగుచెఱగుల అత్తమిల్లిన వట! ఆ తెలివెన్నెల జ్యోతులలో నిండుగా పండిన తనపైరును చూచుకొని మురిసి కర్షకుడుం పత్తుకబంటి సంతసమున కూనిరాగములను తీయుచున్నాడట (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 124) చొక్కమైన వర్ణన మిది. శారద చంద్రికలనందరు ప్రబంధవర్ణనల పట్టికలోఁ గనిపించు పుండరీకములు మల్లెలు మొదలగు వస్తువులతోనే తనివితీఱ వర్ణించి ముచ్చటపడినారుగాని ఈగాథాసప్తశతికారునివలె నిత్యజీవితములో కన్పించు ప్రధానవస్తువైన బియ్యమును పోలికగా గ్రహించి ఎవ్వరూ వర్ణించినటులు కన్పించదు.

సంక్రాంతి సంబరములతో సమ్మదము కలిగించు ఋతువు హేమంతము. గాథాసప్తశతిలో ఈఋతు వర్ణనపద్యములు క్వాచిత్కములుగా కన్పించుచున్నవి. ప్రపంచమున ప్రజలు తమతత్వమెంత నిగూఢముగా నుంచుకొన్నను అది వారి నడతచేతనే ఎరుకపడుచుండు నని కమలములను బట్టి కమలించి నపుడే హేమంతము వేడిమనకు తెలియునుగదా యని ఈఋతు లక్షణము అర్థాంతరన్యాసాలంకార రూపమున ఒకపద్యములో చక్కగా వర్ణింపబడినది (శా.గా.స.సా.రా.అ.కృ.శ పుట 129)

పలుచని తమలపాకులవంటి పసిపాపలు మొదలుకొని పండుముదుసలుల

వరకు సమస్తజనులను ఉహుహూ యని వణకింప జేసెడి ఋతువు శిశిరము ఎండా వానలు రెండు రెండునెలలే యుండ శని వలె వచ్చి నాలుగు మాసముల తరబడిగ వేసట లేక జీవించు మొండివానివంటి దీఋతువు. ఈసీతువు గిజగిజవలన గలుగు మెరమెరలను సప్తశతి చక్కగా చూపించినది. ఒడలిని పులకలలు పొడవిని వడవులు సీత్కృతులతోడి పలుకులు _ ప్రియకాంతునివలెనే శీతకాలము జనులకు వగలను కలుగ జేస్తున్న దట (కా గా.స.సా. రా.అ కృ శ పుట 175) రసికునివలె గిలిపెట్టి శీతాకాలము జనులకు పులకలు, వడకులు చీత్కారములు కలిగింపజేస్తున్న దని వర్ణించినవిధానము ఆకర్షణీయముగానున్నది. గగుర్పాటు కలిగిన కాయములతో వణకులతో ఊర్పులతో, దారిదోపిడి గాండ్రు కూడా ఈ శీతకాలమందు వలపుతగులాటమందు చిక్కుకొన్నట్లుగా కన్పించుచున్నారట (కా.గా సా స రా. అ. కృ శ పుట 138) దొరకోలు సన్నాసులను కూడా దోరవలపు మనసులు గల మనుషులనుగా మార్చిన ఈ చలిమహిమ అద్భుతముగదా! పొగలేని కుంపట్లవంటి భార్య చనుదోయి కౌగిలింతలలో చలి నుండి రక్షించుకొనవచ్చునని పల్లె సేద్యగాడు పచ్చడమునమ్మి కొత్త ఎద్దును కొనుక్కున్నాడట (కా.గా స సా రా అ కృ శ.పుట 49, పర్వతఫలాదులతో పోల్చ స్త్రీ కుచములను మర్మురములతో పోల్చి గాథాసప్తశతి యొక్క నూతనోపమానమును సూచించినది తరువాత దీనినే శ్రీనాథాది_కొందరు కవులు తమపద్యములలో ఉపయోగించుకొనినారు! ఊరి బయట దేవళముదగ్గర చలికాచుకొనుటకు అంటించిన గడ్డిమంట ఎలుగుబంటివలె నున్నదట (కా.గా స.సా రా అ కృ శ పుట 21) మీద నల్లనిబొచ్చు లోపల ఎఱ్ఱని చర్మముగలిగిన ఎలుగుగొడ్డువలెనే గడ్డిమంట కూడా మండి మీద నల్లని మసి లోపల ఎఱ్ఱని నిప్పుకణికలు గలిగియున్న దని గాథాసప్తశతికారుడు భల్లూకమునకు అగ్గికుప్పను పోల్చి చెప్పినాడు. ఈ విధముగా పోలిక చెప్పిన కవులు కనీసము కన్పించనైనా కన్పించరు దీనివలన నాటికవులు ప్రకృతిలో విహరించు జంతువుల నెంత సునిశితముగా పరిశీలించి పరీక్షించి వాటిని తమ కవితో పమానములుగా గైకొని జనరంజకముగా కవితనల్లెడివారో అర్థమగుచున్నది

ఈవిధముగా గాథాసప్తశతి లోని ఋతువర్ణన గాథలు విడివిడి పద్యఖండములైనను, విభిన్నకవులవైనను, కావ్యమున ఒకచోటగాక అచటచట కూర్పబడియున్నను పాథోధిని పుడిసిటబట్టిన అగస్త్యునివలె మహోన్నతములై విరాజిల్లుచు నాటికవుల ప్రతిభా వ్యుత్పత్తులను చాటిచెప్పుచున్నవి.

—+—

అభ్యుదయ కవితార్ణవం

# దాశరథి 'పునర్నవం'

- శ్రీ డా. జి. బి. ఎస్. ఆచార్య, ఎం ఏ., పి. హెచ్.డి.

అగ్నిధారను కురిపించి, విప్లవజ్వాలలు రేపిన దాశరథి, రుద్రవీణను మీటి, కోటి తెలంగాణా ప్రజల ఏకైక మహాకంఠ ధ్వనిని వినిపించిన దాశరథి, మూడుకోటుల నొక్కటే ముడివిగించి, మహాంధ్ర సౌభాగ్యగీతిని ముక్తకంఠంతో ఆలపించిన దాశరథి_

'ఎత్తైన ఆశాశైలం
నెత్తమ్ముల చెంత నిలచి
పద్యాల పావురాళ్ళని'

బహుదిశల్లోకి విసురుతూ 'పునర్నవం' అనే ప్రగతి ప్రబోధాత్మక కావ్యాన్ని సాహితీలోకానికి కానుకగా అందించాడు దాశరథి కానుకను పరిగ్రహించాలన్నా, ఆయన చెపుతున్న పునర్నవాన్ని అర్థంచేసుకోవాలన్నా మన మనఃకుటిలో కృత్రిమాల చీకటిపోవాలి, మన నరాల్లోకి జవం రావాలి.

అచ్ఛంగా సొంత అనుభవాలు, ఇతరుల అనుభవాలు, వ్యక్తికీ సంఘానికీ గల చుట్టరికం, ప్రకృతికీ వనకూ గల పారస్పరిక బాంధవం, కవితా సౌధరచనకు వాస్తుశాస్త్రంలా తోడ్పడ్డాయి అసలు, కవిత్వం అంటే దాశరథికి ఓ విలక్షణమైన అభిప్రాయం వుంది. ఆయన మాటల్లోనే చెపుతాను_

'అమృతానికి ఆమ్రేడితం కవిత్వం అని తెలిసివుంటే రాక్షసులు దేవతల్తో తగాదాపడే వాళ్ళే కారు మానవుల్తో మైత్రి నెరపి కవిత్వాన్ని అనుభవించేవారు మతాలూ రాజకీయాలూ మనసుల్ని విరగ్గొడతాయి కవిత్వం మనసుల్ని అతుకుతుంది కవిత్వం చదువుతుంటే నలుపు తెలవాళ్ళూ నాలుగో కక్ష్యలవాళ్ళూ కలిసి కూచుని వినడం ఎరుగుదును. క్షణంపాటు విభేదాలు మరవడమూ ఎరుగుదును. ఇది అన్ని ఇజాలవాళ్ళూ చాపకూడు కుడిచే దేవాలయప్రాంగణం.' 1

దాశరథి కవితలో వ్యుత్పత్తి, భావనా బలం, శిల్పం _ అనే మూడు లక్షణాలు ముప్పేటలుగా పెనవేసుకున్నాయి. దాశరథికి స్థలాన్ని ఆక్రమించటంమీద నమ్మకం లేదు కాలాన్ని ఆక్రమించటంలోనే ఆశ. అందుకే ఆయన_

'కంటికి కనిపించిందంతా
కైతగా రాస్తున్నాను!'

అని అన్నప్పటికీ తన 'యన్స-కిరణాలు' కళ్ళతో_

'అనాథుడి కడుపులోని
అంగారం, ఆరాటం;
అతడి కళ్ళలోని అశ్రువులలోతులు'

చూసి, ముష్టిలోకం తలమీద ఇష్టంవచ్చినట్టుగా తన్నే అష్టైశ్వర్యాల వారిని నిరసించి, నిర్మోహమాటంగా వారిపైమాటల ఈటెలను ప్రయోగించాడు. అనాథులంతా వొకపై ధనాంధులపాదాలక్రింది ధరణి తోడేస్తున్నట్లు పీడిత ప్రజావిప్లవాన్ని భావించుకున్నాడు ఇంకా–

'అడుగడుగునా ఉదయాలు,
అంగుళం అంగుళాన హృదయాలు,
పలికి ప్రజావిజయాలు'

దాశరథికి దర్శన మిచ్చాయి

'రేపుమాత్రం జనం చూచే
చూపులో అజ్ఞాన ముండదు
దాస్యముండదు, దైన్యముండదు,
లొంగిపోయే రోగ ముండదు,
రేపువేరే రేపు వేరే,
రెక్కలూడిన స్వప్నదేవత
పిక్కబలిసిన పేదమనిషీ
వొక్కపై లోకాన్ని సాకే
రోజు రేపే, రేపు రేపే!'

అని 'రేపటి జలపాతాల' ఆశాధ్వనిని వినిపించాడు పైగీతాన్ని బట్టి దాశరథికి స్వాతంత్ర్యభావాలు, అభ్యుదయ–పోకడలు బాగా వట్టుపడ్డా యని తెలుస్తుంది బానిసతనం, అన్యాయం ఆయనకు అసహ్యాలు 'ఆశ' ఆయనకవిత్వానికి వూపిరి ఆశయాలు నెరవేరినప్పుడు ఆనందించి కవితా విపంచిని మోగించటం ఆయనకున్న వుత్తమగుణం అందుకే–

'జగత్తులో నేడు సగం
దగాపడుట మానుకుంది'

అని ఆరోగ్యకరమైన వాతావరణాన్ని చిత్రించాడు పీడిత ప్రజానీకం తెలివిగా విజృంభించి, ప్రగతినిసాధించి, విజయవంతమైనందుకు హర్షించాడు.

'పేదజనం నేడు మొగం
తుడుచుకొని మేలుకుంది'

అని 'జాగృతి'కి ఆనందించాడు. తాను కోరుకున్న సోషలిజం కనుచూపు మేరలో కన్పించడంవల్ల సంతోషంతో–

'ధనం దాచగలరు గాని
తేజస్సుని దాచగలరా?
తెరలు దించగలరు గాని
శిరస్సులను వంచగలరా?

అని 'సవాలు' చేసారు ఆయన అన్నది నిజమే ప్రతిభని, స్వాతంత్ర్యాభిలాషని, ఎవరూ అణచలేరు. అవి యే శక్తులకీ తల వంచవు.

'తమ మంత్రం పారదింక
ఉచ్చు త్రెంచుకొనెను జింక,
ఇక స్వేచ్ఛా ప్రయాణము
ఇదే తెలంగాణము'

అని వేదనలో, క్రోధంలో హెచ్చరించాడు. తెలంగాణా స్వాతంత్ర్యోద్యమాన్ని – తత్ఫలితాన్ని ఎలుగెత్తి చాటాడు.

'బాల్యం' అనే సుదీర్ఘ గేయం బాల సాహిత్యానికి మకుటాయమానమైనది. ఏమానవుడూ తిరిగి పొందలేని అమూల్య అనుభవం బాల్యం బాల్యదశలోనిఎన్నో నిర్మలమైన స్మృతుల్ని, అద్భుతమైనభావనాబలంతో చిత్రించటం ఈ గీతంలో మనకు కనిపిస్తుంది దుర్మార్గాలకీ, దుఃఖాలకీ ఇవతలి గట్టున తొంగి తొంగిచూసే లోకం బాల్యం అనీ, అసలు బ్రతుక్కి ఆనందపుపొలిమేర పసితనం అనీ–ఇత్యాదిగా ఎన్నో సుగుణాలను చెపుతూ–

'ఉన్నదాన్ని వున్న వాళ్ళందరిలో పంచి
ఉన్నంతలో అందరం కలిసి భోంచేసి
ఉజ్వలంగా ఆటల్లో పాటల్లోపడి
ఊరంతా తిరగడం ఎంత బాగుంటుంది!'

అని సామ్యవాదాన్నీ, ప్రజాస్వామ్యాన్నీ ధ్వనింపచేసాడు అసలు నిజమైన సోషలిజం బాల్యదశలోంచే అభివృద్ధి చెందుతుంది. చెందాలి– అనే అభిప్రాయాన్ని దాశరథి వ్యక్తం చేసాడు.

'శరీరంలో ఏభాగం దాచదు సరికదా
మనస్సులో అసలే దాపరికాలుంచదు'

అని పసితనపు నిర్మలస్వభావాన్ని తెలియచేసాడు అసలు, అన్ని కుత్సితాలు, కుయుక్తులు, పెద్దరికానికే. పసితనానికి ఇవేమీ అంటవు అందుకనే–

'బాల్యం అనే నౌకమీద పయనించే
దివ్యసమయాలుమళ్ళీ వచ్చేనా?ఏమో!'

అనే చాపల్యాన్ని వెలిబుచ్చాడు.ఆ సమయాలు మళ్ళీరా వని తెలిసినప్పటికీ, వస్తే బాగుంటుం దనే ఆశను తాను కల్పించుకుని, మనకికూడా కల్పించి వూరించిన దాశరథి ప్రతిపదంతో మనలోఆలోచనలు కలిగించి, అనుభూతులు పుట్టించి, మనల్ని వినూత్న లోకాల్లో విహరింప జేయగల సమర్థుడు.

దాశరథి తెలంగాణాలోని కోటిధీరుల గళధ్వని మాత్రమేకాదు, ఇలాగోళమందుండెడి ఎల్లరిశబ్దం అందుకే నా పేరు ప్రజాకోటి, నావూరు ప్రజావాటి అనే విశాల భావాన్ని వెల్లడించాడు అయినా 'అణువంతవాణ్ణి, అసలే కనరానివాణ్ణి' అని వినయంతో చెపుతూనే కోట్లకొలది జనుల మనస్సును ఆక్రమించు కున్నాడు. ఇదే దాశరథి ప్రత్యేకత

'గతమే జీవిత మనుకొని
వర్తమానమే వల దని
వెక్కిరించు కోర్కె లేదు'

అనే బుద్ధిమంతుడు దాశరథి ఆరోగ్యమైన భావాలూ, లక్షలవిలువచేసే లక్ష్యాలూ ఆయనకున్న ఆస్తి

'గతమంతా బూడి కుప్ప
కావాలి మనోజ్ఞ భావి,
తిరగబడం డని అరచే
బికుసువారి నిందింపను'

అనే సహృదయుడు. భావిని ప్రేమించేవాడు, తిరుగుబాటు తత్త్వాన్ని ఆహ్వానించేవాడు, కాబట్టే దాశరథి పైమాటలు పలికాడు ఆయనా–

‘ఇవి రెండూ ఒక కత్తికి
అటూ ఇటూ రెండంచులు’

అని లౌక్యంగా తప్పుకున్నప్పటికీ, దాశరథి పిరికివాడిలా పారిపోడు కనుకనే–

‘నేనుమాత్రం రెండంచుల
సాముచేయగలను లెంకి’

అని తన విశిష్టవ్యక్తిత్వాన్ని ఆవిష్కరించుకున్నాడు. అంతేకాదు–

‘గతాన్ని కాదనలేను
వర్తమానం వద్దనబోను
భవిష్యత్తు వదులుకోను’

అని తనరహస్యాన్ని బయటపెట్టి,మనచేత కూడా అంగీకరింపచేస్తాడు. లేకపోతే ‘కాలం నాకంఠమాల’ అనీ, ‘గున్న ఏనుగును వంచే, కొత్తరకం పద్ధతి కనుగొన్నానండో రండో’ అనీ అందర్నీ పిలువగలశక్తి ఆయన కుంటుందా? ఇంతకూ ఇవన్నీ వుత్తుత్తి మాటలు, వుత్తర కుమార ప్రజ్ఞలు కావు

‘పట్టిచేతితో శత్రువు
పై దుమికే శక్తి వుంది’

అనే ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించిన దాశరథి – ఎర్రజెండాలను, త్రివర్ణపతాకాలను కలపగలడు రెండింటినీ ఒకదాని ప్రక్క ఒకటి ఎగురవేయగలడు అసలు–

‘ఎవడైనా మానవుడే
ఎందుకు ద్వేషించడాలు?
రాక్షసికైనా మైత్రికి
రానిత్తును, భయం లేదు’

అని, మానవత్వాన్ని ప్రతిపాదిస్తూనే, రాక్షసత్వాన్నికూడా లొంగదీసి, తన మార్గానికి మలుచుకోగల ధీమాను ప్రకటించటం దాశరథి గొప్పతనం. దాశరథి ధీమాకు అసలుకారణం ఏమిటని ఆలోచిస్తే –

‘హృదయం వినా నాదగ్గర
ఏవస్తువు లభించదు
ఉదయం వినా కంటికి
ఏవస్తువు రుచించదు.’

అనే విశిష్టమైనకారణం లభిస్తుంది దీన్ని బట్టి దాశరథి హృదయాల వూయల లూగుతూ, ఉదయాల రాగాలను వినగల ప్రతిభావంతుడని చెప్పవచ్చు

‘ఉషస్సంధ్య’అనే ఖండికలో ప్రజాభ్యుదయం కోసం పోరాడి, ప్రాణాలు కోల్పోయిన వీర శిఖామణులను ప్రశంసిస్తూ–

‘చనిపోయిన యోధులగుండెలు
తరుణ పయోజమ్ముల దండలు
అవి తెచ్చును ప్రభాకిరీటం
అవి విచ్చును ఉషఃకవాటం

అనే ఆశాభావాన్ని వ్యక్తంచేసాడు.

‘ప్రాణిదీపం’ అనే ఖండిక దాశరథి తాత్త్విక ధోరణిని, తార్కికశక్తిని వెల్లడిస్తుంది

‘అయిదు రేకుల దీపకళికను
ఆర్పజూచెద రెవ్వరు?

అనే ప్రశ్నలో జగత్తంతా ఈ ప్రాణదీపపుకాంతితో నిండివున్నదని, స్ఫురింపచేసాడు ఇంకా ప్రాణదీపపు కాంతి నిత్య మనేసత్యాన్ని వక్కాణిస్తూ–

‘గగనములు పడిపోయి సాగర
గణము పాతాళమున కింకిన
గాని ఈ ప్రాణదీపము
కాంతితగ్గదు, సత్యము’

అని ఢంకాబజాయించి, వినిపించాడు. తాను చెప్పింది నిజమేసుమా! అని పించాడు

‘యశోరాశి’ అనే ఖండిక కీ శే. సురవరం ప్రతాప రెడ్డిగారి దివ్య స్మృతికై వెలిగించిన దీపిక. రెడ్డిగారి బహుముఖ ప్రజ్ఞను వేనోళ్ళ కొనియాడుతూ, ఆయనను ఆదర్శంగా గ్రహించి, ఆయనఅడుగుజాడల్లో నడవటానికి నిశ్చయించే–

‘అతడు లేని తెలంగాణ
అలంకరణలేని జాణ
అతడులేని సాహిత్యం
చిటిలి విడిన ముత్యం’

అని ఆయన లేని లోటును ఎత్తిచూపాడు, తెలంగాణ వైతాళికుడైన రెడ్డిగారు – చరిత్రకారుడు, కథకుడు, కవి, విమర్శకుడు, పాత్రికేయుడు, రాజకీయ ధురంధరుడు, పండితుడు, వ్యాఖ్యాత – ఇన్నేల?

‘అఖిల విద్యల సమాహార
మాతడు విజ్ఞాన ఖని,
మూగవడిన తెలంగాణ
మూల్గిన తొలినాటి ధ్వని’

ఇలా రాసుకుంటూపోతే చివరకు మాటలే చాలవు. ఇంతటి ప్రతిభావంతుడు, ప్రజ్ఞాశీలి, కాబట్టే దాశరథి తన ‘మహాంధ్రోదయ’ కావ్యాన్ని ఆయనకు సమర్పించి, తన భక్తి శ్రద్ధలను వెల్లడించాడు. కవిగా ఇంతకంటే ఏం చేయగలడు?

‘కిరణ శకలం’ అనే ఖండికలో–

‘జల ప్రపాతంలో వినబడు
విద్యుత్తు గుసగుస వలె
నామనస్సులో ఏవో
భవిష్యత్తు మాటలు!’

అని తన మనస్సులోని భవిష్యత్తుమాటలను మనకు వినిపించాడు ఏడ్చే దీనుని కన్నీళ్ళలో ఎంతో కొంత విద్యుత్తు పుడుతుందని కనిపెట్టిన దాశరథి కేవలం కవి కాదు, విజ్ఞాన శాస్త్రవేత్త కూడాను. ఆయన విజ్ఞానం మామూలువిజ్ఞానం కాదు ఎంతో విలక్షణమైనది.అనే విషయాన్ని–

‘పరమాణువు పగుల కొట్టి
ధరిత్రికి ప్రమాదాలు తెచ్చిన
‘శిరస్సు’లకు బుద్ధిచెప్పే

అనే మాటలు వెల్లడిస్తాయి. ఆయన కున్నది ఒకటే ఒక ఆయుధం. అదే కవిత ఆ ఆయుధంతోనే ఈ జగత్తునంతనూ గెలిచి, వీరవిహారం చేయగల యోధుడు.

'కోతిని మనిషిగా తొలిచిన
కాస్మిక్ - రేడియేషన్ బలమే
నాకలంలో చేరబడి నేడు
మనిషిని దేవతగా మలుస్తుంది'

ఇదీ దాశరథి కలం బలం ఇంతటిబలం వుంది కనకనే ఆయనకలం 'తిరుగుబాటు' ను అవలీలగా ఆహ్వానించ గలుగుతుంది

'చల్లని నీటిలో ఎంతో
జలవిద్యుత్తున్నప్పుడు
పల్లెవాని గుండెల్లో
పెల్లుగా తిరుగుబాటుండదా?'

అని అసలు 'తిరుగుబాటు' ప్రకృతి ధర్మమనే భావాన్ని స్ఫురిప చేస్తాడు దాశరథి చెప్పినట్లు చల్లని నీటిలోనే విద్యుత్తున్నప్పుడు, ఉడుకు నెత్తురులో తిరుగుబాటు పుట్టడంలో ఆశ్చర్యం యేమీ లేదు అతి సహజమైన ఈ తిరుగుబాటు దేనికి దారి తీయాలో కూడా తనే చెప్పాడు.

'భూమినిచుట్టిన జలనిధి
పోలిక శాంతిని పెంచి
యుద్ధాన్ని అరెస్టు చేసి
మరణశిక్ష విధిస్తాము'

విశ్వవ్యాప్తమైన శాంతిస్థాపన దాశరథి ధ్యేయం ఈ ధ్యేయంతోనే-

'చితిమంటల యుద్ధానికి
ప్రతికవి ఒక ఫైర్ బ్రిగేడ్
అణ్వస్త్రపుగ్రీష్మానికి
ప్రతిపద్యం పయోధరం'

అని ఫలశ్రుతిని పలికాడు. కవులూ, కలాలూ శాంతి స్థాపనకే అంకితమవాలని దాశరథి ఆదేశం, అమృతమయ సందేశం.

'ఆకలిదీపం జోరుగా వెలిగి
పాలకుని చూచి భయం తొలగి
విప్లవం కమ్మితే ప్రళయం,
ఇదే మనసిద్ధాంతాల నిలయం'

అని చిత్రవిచిత్రంగా 'యుగాంతరేఖ' చిత్రిస్తూ-

'సామ్యవాదపు 'మాగ్నాకార్టామీద'
చేవ్రాలు చేశాడు నిరుపేద'

అని తన హార్దాన్ని వెలిబుచ్చాడు అసలు, మాగ్నాకార్టా మీద సంతకం చేసే హక్కు కొన్నివర్గాలవారిదే అయింది కానీ దాశరథి సామ్యవాదపు మాగ్నాకార్టామీద నిరుపేదకూడా చేవ్రాలు చేయటం గమనింపదగిన విశేషం.

(సశేషం)

1 'పునర్నవం' (మననం) దాశరథి. పుట XV, XVI

# సంక్రమణలక్ష్మి కక్షర స్వాగతమ్ము

– శ్రీ ధూళిపాళ అర్కసోమయాజి.

* వాగమృతంపు వాహినిగ
భావపరంపర జాలువార, నీ
యాగమనంబుఁ గోరి మధు
రాక్షరమాలల రంగవల్లులన్
బాగుగ దిద్ది తీర్చితి శు
భంకరమూర్తిగ నావహింప, సు
స్వాగతమమ్మ! ఓ! మకర
సంక్రమణేందిర! వేగ రాఁగదే!

* క్షుద్రంబైన కలిప్రభావమునకున్
శోకించుచున్ సర్వదా
నిద్రాణంబయినట్టి మానవులలో
నిండైన చైతన్యమున్
భద్రాకారత నొప్పి నింపుచుఁ గృపన్
బాపౌఘముల్ బాపగన్
రౌద్రీవత్సర పౌషమాసశుభసం
క్రాంతీ! మహిన్ రాఁగదే!

* శాంతియె లేక ఆర్నెలలు
సాకిన సస్యముఁ బండఁగోని మే
ల్కాంతుల ధాన్య రాశులను
గాదులనింపి కృషీవలుండు వి
శ్రాంతిని గొంతఁ బొందుచునుఁ
జక్కఁగ నూడ్పులబూర్తి జేసె సం
క్రాంతి దినేందిరా! యతని
కన్నులఁ బండువుఁ జేయరాఁగదే!

* శిరమం దల్లదె కాంస్య కుంభముమహా
చిత్రంబుగా నొప్పగాఁ
దిరుచూర్ణంబు లలాటపట్టిఁ దనరన్
దీపించు తేజంబుతో
'హరిలోరంగహరీ' యటంచు హరిదా
సత్యంత దీక్షతో
స్వరముల్ బాడుచు నాడుచుండెఁ
గనుమా
సంక్రాంతి సీమంతినీ!

* గొబ్బెమ లైదు వెట్టి తగ
కుంకుమబొట్టు లలంకరించి నే
డబ్బుర మొందునట్టులుగ
హస్తములన్ గదలించు చొండొరుల్
సుబ్బియగొబ్బె యంచు బహు
సుందరగీతము లాలపించుచున్
గుబ్బెత లల్లదే పతిగ
గోరుచునుండిరి బ్రోవ రాఁగదే! *

# రమణీయ కావ్యము - 'మొల్ల రామాయణము'

- భాషాప్రవీణ శ్రీమతి సాపాటి అరుణకుమారి, ఎం ఏ

( గతసంచిక తరువాయి )

## వర్ణనలలోని వైయక్తికత

అయోధ్యా కాండలోని అంధకార, నిశా వర్ణనలు సహృదయ హృదయోల్లాస కరము లగుటయే కాక లౌకికానుభవాన్ని, ప్రకృతిశోభనూ ఆకళింపు చేసికొటలో ఆమెకుగల ప్రత్యేక వ్యక్తిత్వమును చాటుచున్నవి.

'కాటుక మొగులరీతి, కాటుక చందాన
నీటిభాతి, నింద్రనీల మహిమ
మాషరాశిపోల్కి మతిమతి యపు డంధ
కార మవని యెల్ల గలయ బర్వె'

ఎందరో చీకటిని వర్ణించినవా రున్నారు కాని నీటితోను, మాషరాశితోను పోల్చడంతో ఆమె నవ్యభావుకత గోచరిస్తుంది 'ప్రకృతికిన్ భాష్య ప్రణేతల్ కవుల్' కాబట్టి ఆమె తన హృద్గత శబ్దార్థములను వివరించినది

మధురావిజయములో గంగాదేవి చంద్రుని వర్ణించిన తీరులో స్త్రీ మూర్తి గోచరించును అట్లే మొల్లకూడా అలతి అలతి పదములతో చిన్న చిన్న వాక్యములలో ఉపమానములతో చిక్కని చీకటిని చక్కగా హృదయాలకు హత్తుకొనునట్లుగా రూపు కట్టించినది. ఇట్లే -

'మేలిమి సంధ్యారాగము
ప్రాలిన చీకటియు గలిసి వరుణునివంకన్
నీలము కెంపును నతికిన
పోలిక జూపట్టె నట నభోమణి తలగన్'

ఈ విధంగా ఈపద్యము హృదయంగమంగా పాఠకుల మనః ఫలకములపై చెరగని ముద్రవేయును మహాకవి నన్నెచోడుని పదప్రయోగ విశిష్టతలను అందుకొని వాటికి క్రొంగొత్త రూపములను సంతరించినది నన్నెచోడుడు-

'తన సుతుడగు శశి మెయిఁ గఱఁ

యనఁ జంద్రిక పర్వె, సాంద్రమై,
విమలంబై'

అన్న ఈ భావాన్నే మొల్ల -

'కొడు కుదయించె నం చలరి
కోరిసుధాంబుధి మిన్నుముట్టి, య
ప్పుడు జగమెల్ల గప్పె ననఁ
బూర్ణతనం దెసు సాంద్రచంద్రికల్'

అని మలుపు త్రిప్పినది పోతన్నగారి పదలాలిత్యమును, శ్రీనాథుని పదప్రసిద్ధిని ధారాశుద్ధిని సమ్మేళనము గావించి, సరిక్రొత్త పోకడలతో నవ్యభావములతో ఈ రామాయణ మహాకావ్యము సంతరించినది. ప్రబంధ వర్ణనలను కూడ పరిహరింపలేదు నవరసములను ఆవిష్కరించినది చిన్ని కందపద్యములలో చక్కని భావములను వ్యక్తము చేసినది అలంకారములను అలంకరించడంలో తగు శ్రద్ధ వహించింది అయోధ్యా వర్ణన సందర్భమున -

'కవి గురు బుధ మిత్రాదులం
వివిధార్చనల నమరపురి వెలయుదు
రెలమిన్
'ప్రకటానురాగ సంపన్నులౌ మరు కాని
రమణీయు రుక్మ కార్ముకులు గారు

'రాజులు కాంతియందు, రతి
రాజులు రూపమునందు, వాహినీ
రాజులుదానమందు, మృగ
రాజులు విక్రమకేళియందు, గో
రాజులు భోగమందు, దివ
రాజులు సంతత తేజమందు, రా
రాజులు మానమందు, నగ
రమ్మున రాజకుమారు లందఱున్'

ఈ పద్యాలలోని శ్లేష, విరోధాభాస, యమకాది శబ్దార్థాలంకారాలను పరిశీలిస్తే సముచితరీతిలో తన కావ్యేందిరకు శోభలు వెలార్చడంలో మొల్ల నైపుణ్యం విశదం కాగలదు

## స్వభావోక్తి చాతుర్యము

అన్ని వర్ణనలకంటె స్వభావోక్తి వర్ణనలో నామెకు గల నిశితమైన దృష్టి, జాగరూకత, పట్టుదల మొ॥నవి కన్పించుచున్నవి

నడువ నేరని కొమ్మ యడుగులు పొక్కులై
శర్కర స్థలముల శ్రమము జెంద
వీచిన చేతుల వ్రేళ్ళు నెత్తురు గ్రమ్మ
పొటమర్లు కెంపుల పోల్కి నమరె

ధవుని నడుగడుగునకుఁ గైదండ గొనుచు
నెగడు దప్పిని నిట్టూర్పు లెగసి చిగురు
బెదవు లెండగ నీడకు నుదిల గొనుచు
మనసులో జేవ యూతగ జనెడు వేళ'

4 ప ఆర కాం.

ఈ వర్ణన కరుణరసంతో జాలువాఱుతూ కళ్ళనీళ్ళు రప్పిస్తుంది పాఠకులకు

'మొగము బిగించి పాదముల
మొత్తముగా నటనూది త్రొక్కి, నీ
టుగ మొగ మెత్తి భీకర క
ఠోర రవంబున నార్చి బాహు ల
త్యగణితలీల నూచి వల
యుంబుగ వాలము ద్రిప్పి వ్రేగునన్
నగము సగమ్ము గ్రుంగ, కపి
నాథుడు నింగికి దాటె తీవ్రనన్

మొదలగు పద్యములయందు స్వభావోక్తి సుభగత్వము ద్యోతకమగును. చిన్ని కందములో వర్ణ్యవస్తువును విపులముగా చెప్పును. పతివియోగదుఃఖితమతియైన సీతమ్మను హనుమంతునకు చూపు విధము అద్వితీయము అల్పాక్షరములలో అనల్పార్థరచనతో స్వభావ వర్ణనలు ఏకధారగా కురిపించడంలో ఈమె దిట్టతనము కాన్పించును. రామునకు హనుమచే ప్రతి సందేశము పంపిన తీరునుబట్టి శోకమూర్తియైన సీతను చిత్రించిన తీరులో మనకు కవయిత్రి కవితాశిల్పము గోచరించును

పాత్ర చిత్రణ

మొల్లరామాయణములోని పాత్రలన్నీ ఒకయెత్తు, సీతమ్మ పాత్ర చిత్రణ మరి యొకయెత్తు ఇనవంశోత్తముడైన రాఘవుడు ' స్వయంవర సమయంలో సీత మనకు ప్రప్రథమంగాదర్శనమిస్తుంది తరువాత రావణ సంభాషణలోను కనబడుతుంది సీత హనుమతో చేసిన సంభాషణకు మొల్ల మరింత మెఱుగుపెట్టి శోభను చేకూర్చినది

పాపము బంగారులేడి గొడవలోబడి లక్ష్మణుని తూలనాడినందుకు నా కీశిక్ష అనుకొని క్షమాపణ ఎప్పుడెప్పుడు చెప్పుదునా అని తలపోయుచున్న సీతకు మారుతి ఆగమనము ఊరట కలిగించును. మరదియెడ తాను చూపిన తొందరపాటుకు సిగ్గువిడచిన సీతయొక్క బేలతనమును వ్యక్తము చేసినది రావణుని అహంకారమును గడ్డిపోచవలె తృణీకరించి రాముని గొప్పతనమును స్తుతించి సీత తన వ్యక్తిత్వము నిరూపించుటయందు కవయిత్రి వ్యక్తిత్వము కన్పడును సూక్ష్మములో మోక్షముగా నైన పున్నంతలో సీతమ్మ శీలానికి కలికితురాయి పెట్టినది మొల్ల మొల్ల వ్యక్తిత్వ సౌభాగ్యానికీ ఔన్నత్యానికీ ఈశిల్పము ఒక విజయపతాక

నుడికారములు - జాతీయములు

ఆయా సందర్భాలలో ఆయాపాత్రల ప్రసంగవశమున పలుకుబళ్ళు నుడికారపు సొంపులూ బంగారమునకు తావి అబ్బినట్లుగా ప్రయోగించినది
ఉదా -

'దయ్యాలకు బలిపెట్టెద'
'కడి కండలు కోసి తినుడు'

మొదలగు జాతీయాలు సహజ సుందరంగా ఉన్నాయి
'ఎల్లవేళల నేఁజెవినిల్లుగట్టివిన్నపము సేయ'
'నే డెల్లి శాంతింపుమా'
'వెన్నతో బెట్టిన విద్య
కంటిలో నెఱుసు చందమున'

మొదలగునవి మొల్లకావ్యానికి జేసినప్రతిజ్ఞకు శ్రుతిసుభగములైన ప్రయోగములు మచ్చునకివి మాత్రమే లక్ష్మణుడు రణరంగలో మూర్ఛాగతుడైనపుడు హనుమ ద్రోణాచలం నుండి సంజీవకరణిని తీసికొని రావడానికి వెళ్ళి ఆమూలిక ఏదో తనకు తెలియక ఆ పర్వతాన్నే మొత్తంగా పెకలించి తీసుకువస్తాడు ఆ పర్వతంలోని ఓషధులు 'ప్రాచీదిక్కునందు శతకోటి వారిజాప్తదీప్తిలోకంపంచగా శ్రీరాముడా దీప్తిఁజూచి సూర్యోదయమగుచున్నదనే భ్రమతో -
మాకులంబునకెల్లను మహిని దలప
... .
కొసరి చుట్టాలు బగవారి గూడ వలెనె?'

ఈ సామెత ప్రయోగింపబడినతీరు మిగుల ప్రశంసనీయము
'సుడిగొని రామ పాదములు
సోకిన ధూళి వహించి రాయియే
ర్పడ నొక కాంత యయ్యెనట '

ఏమి ఈ పద్యంలోని గడుసుదనం! సూక్తివైచిత్రి, సజీవమూర్తుల విలాసాలు, పద్యంలోని హొయలు మనకు సాక్షాత్కరించును. మొల్ల అధ్యాత్మ రామాయణాన్నే అనుకరించిన దంటారు కొందరు అందులోని గుహుడు-
'క్షాళయామి తవ పాదపంకజ
తే పాదయో రితి కథా ప్రథీయసీ॥'

అందుకే నీకాళ్ళు కడుగుతానన్నాడు గుహుడు మన మొల్ల పద్యములో ఉన్న సొగసిందు కాన్పింపదు గదా! ఈ భావాన్నే తులసీదాసు, అయ్యలరాజు రామభద్రుడు, కూడా తీసికొన్నారు కాని పైభావానికి మొల్ల చూపినంత సొగసు ఇతరకవు లెవరును సాధించలేకపోయినారనిన అత్యుక్తి కాదు. శరవేగముతో నడచిన మొల్లరామాయణములో ప్రసిద్ధిగాంచిన పద్యాలలో ఈక్రిందిపద్యము ఒక మచ్చుతునక పరశురాముడు రాము నెదుర్కొని-
'రాముడు గీము డంచును ధ
రాజను లెల్ల నుతింప దిట్టవై
భీముని చాపమున్ విరిచి
ప్రేలెద! వందులకేమిగాని! యీ
శ్రీమహిశేశు కార్ముకము
జేకొని యెక్కిడు దేని నేడు నీ
తో మరి పోరు సల్పి పడ
ద్రోతు రణస్థలి నీశరీరమున్'

మొల్ల తెలుగు పలుకుబళ్ళను చిత్రించిన తీరు గమనింతము -
'శివుని విల్లు శ్రీరాము డెక్కుపెట్టి విరిచినాడ నను చు విజ్ఞ
... విఱచినాడ ననుచు విఱ్ఱవీగ

చివికిపోయిన తెలుగు పదానికి సందర్భోచితముగా ఎంతో జీవము పోసినది. ఇతివృత్త నిర్వహణలో మార్పులు చేర్పులు చేసినది రసపరిపోషణ సమర్థంగా నిర్వహించినది భాషా నైపుణ్యముతో అందరికవుల మన్నలను ఒడసిందది అచ్చ తెలుగు జాతీయములతోను నుడికారపు సొంపులతోను కావ్యమునుతీర్చి దిద్దినది

మొల్ల తన పూర్వుల ననుసరించినట్లుగనే మొల్ల ననుకరించిన కవయిత్రులుం కవులును ఎందరోకలరు మొల్ల ఎందరికో మార్గదర్శకురాలైనది సహజ కవయిత్రి మహాభక్తురాలునైన మొల్లరామాయణమునకు భక్తాంధ్ర మహాజనుల

హృదయమున నొక విశిష్టస్థానము కలదు. మొల్లరామాయణము అనితర సాధ్యము, అనిదం పూర్వముగా రచింపబడినది. భావములందున, భాషయందును ప్రశంసనీయమైన మార్దవమును చిందినది.

ఇంత ప్రౌఢతతో కావ్యరచనము చేసినను అటనట దుష్టసమాసములు మొదలగు ప్రయోగములు కన్పించుచున్నను అవి ఈమె రచన కపకర్ష కల్గించునట్టివి కాజాలకపోవుట గమనింపదగినది. మొత్తముపై ఈమె కావ్యము 'తెనుగునకున్ బొందై, రుచియై, వీనులవిందై విబుధుల మదికిన్' కన్పించును 'కందువ మాటలసామెత లందముగాగూర్చి మిక్కిలి జాతీయమైన కవిత్వముతో రామకథను కావ్యగానము చేసిన మహాతపస్విని మొల్ల తెల్గులకు గర్వకారణముగా సదా వెలుగొందుచుండుననుట అతిశయోక్తి కాదు సహజోక్తియే.

—+—



# గౌడీయ వైష్ణవమతం - దర్శనం

(గతసంచిక తరువాయి) - శ్రీ శివకుమార్.

వైష్ణవపదం ప్రాచీనకాలంలో లేదు వైష్ణవపదం మహాభారతంలో ఒకచోట మాత్రమే వుంది. భాగవతులు విష్ణువును ఆరాధిస్తారని బృహత్సంహిత విష్ణుభక్తుడుగా దీక్ష తీసుకునే శూద్రుడు భాగవతుడని వరాహపురాణం గ్రీకు హెలియోడోరస్ ప్రాచీన భాగవతుడు కాశిపుత్ర భాగభద్రుని ఆస్థానంలో దేవదేవుడు వాసుదేవుని గౌరవార్థంగా ధ్వజాన్ని ప్రతిష్ఠించాడు ఇండో బాక్ట్రియన్ రాజు అంటియాల్ కిడస్ రాయబారి హెలియోడోరస్ గుప్తరాజులకాలంలో శక్తివంతమైన భాగవత సంప్రదాయం వేళ్లూనింది సముద్రగుప్తుడు గరుడధ్వజ చిహ్నాన్ని స్వీకరించాడు. రెండవ చంద్రగుప్తుడు పరమ భాగవతుడుగా చెప్పుకున్నాడు ఇతనికుమార్తె ప్రభావతి గుప్తను వాకాటకరాజైన రెండవరుద్రసేనునకిచ్చాడు. రెండవ రుద్రసేనుని పూర్వులు శైవులు ప్రభావతిగుప్త ప్రభావంతో రుద్రసేనుడు చక్రపాణి (విష్ణు) భక్తుడయ్యాడు గుప్తులకాలంలో విష్ణువు అవతారాన్ని పూజించారు కాళిదాసుని మేఘదూతంలో వామనావతారం వర్ణించబడింది పల్లవరాజు విష్ణుగోపుడు (క్రీ.శ 350-375) అనేనామంవలన కృష్ణుడు గొల్లస్త్రీలతో గడిపివుంటాడు గుప్తులకాలంలో వరాహ అవతారం ప్రచారంలో వుంది బాదామి చాళుక్యులుకూడా వరాహఅవతారాన్ని స్వీకరించారు హూణరాజు తోరమణ (క్రీ.శ 500) కాలపు శిలాశాసనంలో వరాహరూప నారాయణ దేవాలయం ప్రతిష్ఠచేసినట్టుంది

## పంచరాత్ర సిద్ధాంతం

పంచరాత్ర సిద్ధాంతాన్ని వ్యూహవాద మంటారు. పంచరాత్ర సిద్ధాంతం శాంతిపర్వంలోని నారాణీయవిభాగంలో వస్తుంది గీత పంచరాత్ర, సిద్ధాంతాన్ని ప్రస్తావించలేదు బ్రాహ్మణుడు పంచరాత్ర మతాన్ని స్వీకరిస్తే వేదపూజలన్నిటిని కోల్పోతాడని 13వ శతాబ్దపు హేమాద్రి వ్యూహపురాణంలో వుంది స్త్రీలకు, శూద్రులకు, కూడా దీక్షనిచ్చారు పాంచరాత్రులు వేదవిరుద్ధం భాగవతులు పాంచరాత్రులు భిన్నులని బాణునిహర్షచరిత వ్యాఖ్యాత శంకరకవి భాగవత అంటే విష్ణుభక్తుడని పంచరాత్రికఅంటే వైష్ణవభేదం (వైష్ణవారాధకులలో ఒక సంప్రదాయం) అని వివరించాడు ఉభయులూ వైష్ణవారాధకులే పాంచరాత్ర పద్ధతి శైవవైష్ణవాలయాల్లో అనుసరించేవారని 7,9,11 శతాబ్దాలకు చెందిన కాంబూజ (కాంబోజియా) శాసనాలను బట్టి తెలుస్తున్నది అన్ని వైష్ణవాలయాల్లో పంచరాత్ర పద్ధతే అనుసరించబడుతోంది.

## వైష్ణవమతం

గుప్తుల అనంతరం ప్రాచీన రాజులందరు వైష్ణవపదాన్ని వాడుకున్నారు వైష్ణమతాన్ని రామానుజుడుస్థాపించాడు. శ్రీవైష్ణవం పూర్వకాలంలో భక్తి, పాంచరాత్ర, వేదాంతరూపాల్లోవుంది రామానుజుడు వీటిని ఏకంచేసి ఒకే సిద్ధాంతం కిందకు తెచ్చి ఒకే తత్త్వాన్ని ప్రతిపాదిం

చాడు. శ్రీవైష్ణవులకు ఆళ్వారులే ఆదిగురువులు నాథముని మనుమడు యామునాచార్యుడు (క్రీ.శ 1038) పాంచరాత్రం అవైదికం కాదన్నాడు యామునుడు వేదాలెటువంటివో పాంచరాత్ర గ్రంథాలటువంటివే రామానుజునితో యామునుని యత్నం సఫలమైంది యామునుని శిష్యుడు శైలపూర్ణుడు(నంబి) అతనిసోదరి కాంతిమతి అసురకేశవుణ్ణి పెళ్ళి చేసుకుంది వారికి రామానుజుడు పుట్టాడు పంచరాత్రం వైష్ణవంలో ముగ్గురూ మూడుతత్త్వాలను ప్రబోధించారు. నింబార్కుడు ద్వైతాద్వైతవాదం, మధ్వుడు ద్వైతం, వల్లభుడు శుద్ధాద్వైతవాదం వాటినే వరుసగా హంస, బ్రహ్మ, రుద్ర సంప్రదాయాలంటారు పద్మపురాణంలో శ్రీ, బ్రహ్మ, రుద్ర, సనక అనే నాలుగు సంప్రదాయాలున్నాయి సనకసంప్రదాయమే వల్లభుని హంస సంప్రదాయం గౌడీయవైష్ణవం ఒక ప్రత్యేక సంప్రదాయంగా పేర్కొనబడలేదు మధ్వుని బ్రహ్మసంప్రదాయానికి దగ్గర చైతన్యుడు శక్తి శక్తిమత్తుల సంయోగంగా వివరించాడు. రాధాకృష్ణులు, గోపికలు, బృందావనంలో రాసలీల, చైతన్యుడు క్రొత్తగా కనుగొన్న విశేషాలు వైష్ణవానికి ఒక నూతన జీవితాన్ని నూతనశక్తిని, ప్రసాదించాడు. రాధికను ఆనందానికి ప్రతీకగా ఆదర్శీకరించాడు.

రాధాకృష్ణులు - చైతన్యుడు

గౌడీయవైష్ణవానికి రాధాకృష్ణతత్త్వం ముఖ్యం భాగవతంలోని రాసలీల అతి ముఖ్యం గౌడీయవైష్ణవులకు. వాత్స్యాయనునికామసూత్రాల్లో హల్లీసక, రాసకపదాలున్నాయి వారిచట్టూ గోపికలు నృత్యం చేసినట్టుగా పురుషుని చుట్టూవున్న స్త్రీలు చేసే నృత్యం హల్లీసకం హేమచంద్రుడు (క్రీ.శ 1082-1149) అభిధానచింతామణి, దేశినామాల్లో హల్లీసకానికే రాసకపదం వాడాడు మండలేన స్త్రీణాం నృత్తం గోపికలతో కృష్ణునిలీల ప్రాచీనమే. హాలుని గాథాసప్తశతిలో రాధాకృష్ణుల జంట కనిపిస్తుంది తమిళశిలప్పదిగారంలో రాధాకృష్ణులగాథ కొంచెం భేదంతో కనిపిస్తుంది. భట్టనారాయణుని వేణీసంహారంలో (క్రీ.శ 700) రాధ వుంది. లక్ష్మణసేనుని (1179-1205) సదుక్తికర్ణామృతంలో 11 పద్యాల్లో రాధప్రసక్తి వుంది. చైతన్యుడుకు ముందు (1486 ఫిబ్రవరి జననం) బెంగాల్ లో ఉన్నత మధ్యతరగతులవారు రాధను పూజించలేదు రాధకృష్ణుని హ్లాదినీశక్తి శ్రీకృష్ణుడు పూర్ణశక్తిమంతుడు రాధ పూర్ణశక్తి, శ్రీకృష్ణతత్త్వం కామతత్త్వం శ్రీకృష్ణబీజం కామబీజం శ్రీకృష్ణగాయత్రి కామగాయత్రి. రామానందుని నుంచి చైతన్యునివరకు, సనాతనగోస్వామివరకు, అదే అన్నారు పాణినినిబట్టి కామం అంటే కోరిక, వాంఛ. కామోమే భుంజీత భవాన్ అంటే 'నీవుతినాలని నాకోరిక' కామగాయత్రి, కామబీజం కామం (కృష్ణుని) పొందటానికి సహాయకాలు కామంభౌతికం కాదు ప్రాకృతకామం అప్రాకృతకామం. మొదటిది భౌతికం రెండోది శుద్ధం ప్రాకృతికామం వలన జగత్తుసృష్టి. కామం తొలగినప్పుడే మాయ నశిస్తుంది. రాధాకృష్ణ సంయోగంలో కామానికి తావులేదు. రాధతో లీనమయినప్పుడు అద్వయరసతత్త్వం రాధాకృష్ణుల ద్వంద్వంలో ఏకత్వాన్ని దర్శించడమే గౌడీయవైష్ణవాదర్శం. రాధాకృష్ణుల్ని శాశ్వత ఆనందప్రతీకగా నిలిపిన ఘనత చైతన్యునిదే.

తత్త్వం

తత్త్వం అంటే అనుభవాన్ని హేతుబద్ధం చేయడం. పాశ్చాత్యతత్త్వశాస్త్రం రెండువిశాలభాగాలుగా విభజించబడింది. 1 Epistenology 2 Metaphysics పాశ్చాత్య తత్త్వం తర్కం ఆధారంగా నిర్మించబడింది భారతీయ తత్త్వం దర్శనంమీద ఆధారపడింది. ఈ దర్శన సాధనవల్లనే సాధ్యం ఈసాధన మార్గంద్వారా గమ్యాన్ని చేరుకొన్నవాడే దర్శన శాస్త్రవివరణకు అర్హుడు. గౌడీయవైష్ణవం వేదాంతదర్శనం ప్రాచీన తత్త్వశాఖలు ప్రస్థానత్రయి (ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, గీత)ని ప్రామాణికంగా అంగీకరించాయి నాల్గవ ప్రమాణంగా వేదాంతదర్శనంలో భాగవతపురాణాన్ని చేర్చడమే గౌడీయవైష్ణవానికి ఇతరులకు వున్నభేదం వేదాంతవృక్షానికి చివరికొమ్మ గౌడీయవైష్ణవము. అచింత్య భేదాభేదవాదానంతరం మరొక తత్త్వం పుట్టలేదు వేదరుషులు దర్శించిన సత్యాన్ని ఉపనిషత్తులు గానం చేశాయి. బ్రహ్మసూత్రాల్లో క్రమబద్ధం చేయబడింది 9 వశతాబ్దంలో క్షీణదశలోవున్న బౌద్ధాన్ని పెకలించి తర్కంమీద వేదాంతాన్ని పునఃప్రతిష్ఠించారు ఆనాటినుంచి బ్రహ్మసూత్రాలకు అనేకభాష్యాలు వెలువడ్డాయి చివరిది బలదేవ విద్యాభూషణుని గోవిందభాష్యం. 15 వ శతాబ్ది గౌడీయవైష్ణవుల అంచింత్య భేదాభేదవాదాన్ని స్థాపించేనిమిత్తం భాష్యంరాశాడు

వేదాంతంలో మూడు సమస్యలుంటాయి అంతిమసత్యం జీవాత్మ అంతిమసత్యానికి జీవాత్మకు మధ్య సంబంధం జీవాత్మయే పరమాత్మ అన్నాడు శంకరుడు రామానుజుని బ్రహ్మ స్థూలసూక్ష్మ చేతనాచేతన విశిష్టం కార్యకారణాలు రెండూ ఆయనే, చిత్ (జీవుడు) అచిత్ (జడం) లు పూర్తిగా ఈశ్వరాధీనాలు. సర్వజీవుల హృదయస్థితుడే అంతర్యామి నింబార్కుని భేదాభేదవాదం జీవబ్రహ్మముల ఏకత్వాన్ని, భిన్నత్వాన్ని, కూడా

గుర్తించినవి. ఈ రెండూ బ్రహ్మయొక్క పరిణామం. ఈ భిన్నా భిన్నత్వాలు బ్రహ్మకూ జీవులకూ మధ్యసమాజం. మధ్వుడుకూడా బ్రహ్మజీవుల భేదం ముక్తి పొందినా నశించ దన్నాడు ముక్తాత్మ భగవంతుని సన్నిహిత మవుతుందిగాని ఎప్పుడూ ఏకంకాదు జీవాత్మలు బ్రహ్మ నుంచి ఉద్భవిస్తా యని వల్లభుడు జీవుడు బ్రహ్మఆజ్ఞానుసారి జీవుడు ఆనందాన్ని అనుభవిస్తాడు. ఆనందమయుడు కాడు కాలేడు. బ్రహ్మఆనందమయుడు. జీవులకు ఆనందాన్నిస్తాడు బ్రహ్మ దాత, గ్రహీత ఒకరుకారు. అలాగే బ్రహ్మ జీవుడు, ఏకం కాలేరు. వీటన్నికీ భిన్నమయింది గౌడీయవైష్ణవం. జీవగోస్వామి గౌడీయ వైష్ణవతత్వ వ్యాఖ్యాత తత్వసందర్భన ప్రారంభంలో భాగవత ప్రామాణికత్వం అన్నిటికన్నా ఉత్తమమైనదిగా పేర్కొన్నాడు

వదంతి తత్తత్వ విద
  స్తత్వం యత్ జ్ఞాన మద్వయం
బ్రహ్మేతి పరమాత్మేతి
  భగవాన్ ఇతి శబ్ద్యతే.

తత్వం అంటే సత్యం విద్యాభూష ణుడు సిద్ధా తరత్న గ్రంథంలో అయిదు తత్వాలను పేర్కొన్నాడు ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి, కాల కర్మాలు జీవుడు శక్తి తత్వవిదుడు అంటే తత్వం తెలిసిన వాడు భాగవత తత్వమే ముఖ్య మైనది ఈశ్వరుడు స్వయంసిద్ధుడు మూడుశక్తులు స్వరూప, తటస్థ, బహిరంగ అని వాటినే పరజీవమాయాశక్తులు అంటారు తటస్థం రెండింటికీ సంబంధించింది ఈశ్వరుడే అద్వయుడు విజ్ఞానం ఆనందం బ్రహ్మ అని బృహదారణ్యకం సత్యం జ్ఞానం అనంతం. అని తైత్తిరీయం అద్వయం అంటే జ్ఞానం. చైతన్యం అనేకాదు. చైతన్యం అస్తిత్వం ఆనందం- ఈ మూటి కలయిక అంతిమసత్యమే అద్వయం.

గౌడీయ వైష్ణవం వేదాంత తత్వానికి ప్రసాదించిన ముఖ్యసిద్ధాంతం శక్తిమంతు నిశాశ్వత సమవాయం. గౌడీయవైష్ణవం పరమాత్మను ప్రత్యేకంగా భగవంతుని (కృష్ణుని) గూర్చి చెపుతుంది మోక్షా నికి ప్రాధాన్యంలేదు మాయరెండువిధాలు జీవమాయ, గుణమాయ ఈశ్వరుడు మాయాధీశుడు జీవుడు మాయాబద్ధుడు. చిచ్ఛక్తికి మాయాశక్తికి నడుమ నుండే శక్తి తటస్థశక్తి భక్తివలన మాయా శక్తిని తొలగించుకోగలడు జీవుడు శుద్ధచేతనలో జీవుడు అణుచిత్ లేక చిత్కణం. జ్ఞానంఏకం ఇంద్రియ బలేన వివిధం కల్పితం. శరీరం మారు తుంది నశిస్తుంది జీవుడు అలాకాదు. శాశ్వతద్రష్ట జీవుడు భగవంతుని అంశ భేదాభేదవాదానికి ప్రాతిపదిక జీవునికి భగవంతునికి అంశ అంశి సంబంధం. అచింత్య భేదాభేదవాద మనగా శక్తి పరిణామవాదమే. జగత్తు, జీవులు, భగవ చ్ఛక్తి యొక్క పరిణామాలు తత్వ విచారాన్నిబట్టి అవి భిన్నపదార్థాలుకావు. అర్థాపత్తిద్వారా అనిర్వచనీయాన్ని తెలుసుకోనడమే అచింత్యం అచింత్యం తర్కసహం యత్ జ్ఞానం అని శ్రీధరుడు దుర్ఘటఘట తత్వం హి అచింత్యత్వం అని జీవగోస్వామి జ్ఞానయోగాలకన్నా భక్తిగొప్పదన్నాడు చైతన్యుడు ప్రేమ సిద్ధాంతం దేశమంతటా స్వీకరించబడింది ఫలాపేక్ష లేకుండా ధర్మం చేయుమ న్నాడు పరిపూర్ణ హృదయ విధేయతతో భగవంతుని ఆరాధించాలి అనూయాద్వే షాలను పారదోలాలి సర్వభూతదయ వుండాలి అప్పుడే భక్తి అంటే ఏమిటో తెలుసుకోగలుగుతాడు. పరిపూర్ణజ్ఞానోద యం అవుతుంది పరమసుఖం పొందు తాడు గౌడీయవైష్ణవం విశ్వప్రేమను, సమానతను బోధించింది

నాకోసం ఎవరు కర్మ చేస్తారో
నన్నే గమ్యంగా ఎవరు ఆరాధిస్తారో
అతడు నిస్సంగుడు
సర్వభూతదయామయుడు
ఓ పాండవా! అతడే నాలో ప్రవేశిస్తాడు.

ఈఆశాసందేశం, శంకరుని గీతాసారం గౌడీయవైష్ణవానికి శాశ్వత మయిన విశ్వాసధార పోషకపదార్థము, జీవశక్తి అయింది

* ఈ వ్యాసరచనకు పూజ్యులు ప్రముఖ పండితులు, చరిత్రకారులు, అయిన ప్రొఫెసరు ఎ కె మజుందార్ గారు వ్రాసిన Chaitanya - His Life and Doctrin, Goudiya Vaishnava Studies, రెండు గ్రంథాలూ ఆధారాలు

—(*)—

## రచయితలకు

అతి దీర్ఘములైన రచనలు బాగా ఉన్నను ప్రచురణకు అల స్యము కాగలదు. తమ రచనలకు స బంధించిన కవరుపై లేదా కవ రింగు పేపరుమీదనే కాక లోతట్టు పేజీలలో రచనకు మొదటకాని, చివరగాని రచయిత పూర్తి అడ్రసు తప్పక ఈయవలయును, రచయితలు మాకు సంపూర్ణసహ కార మీయగలరని ఆశించు చున్నాము.

– సంపాదకుడు.

# కాళిదాసుని నాటకకల్పనలు

'భారతీప్రియ'

కవికుల గురువైన కాళిదాసు కావ్యత్రయమును,నాటకత్రయమునురచించెను రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము అనునవి కావ్యత్రయము అభిజ్ఞానశాకుంతలము, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము అనునవి నాటకత్రయము కాళిదాసు కవికుల గురువు కనుక భవిష్యత్ కవికులమునకు ఆదర్శమైన కల్పనలెన్నో తననాటకములందు గావించెను ప్రస్తుతము అభిజ్ఞానశాకుంతలము, మాళవికాగ్ని మిత్రము అను రెండునాటకములలోని కల్పనావిశేషములను గూర్చి **వివరింపబడును**

అభిజ్ఞానశాకుంతలము

శకుంతలా దుష్యంతులకథ మనకందరకు తెలిసినదే వ్యాసభారతమునందు ఈ కథ శకుంతలోపాఖ్యానముగా చెప్పబడినది అట్లే నలదమయంతులకథ నలోపాఖ్యానముగా చెప్పబడినది. ఇట్లు ప్రసిద్ధి గలుగుటలో నొక విశేషము గలదు శకుంతల కథలో ఆమెకే ప్రాధాన్యము అట్లే నలునికథలో అతనికే ప్రాధాన్యము కావుననే శ్రీహర్షుడు 'నైషధీయచరితమ్' అని నలచరిత్ర కావ్యమునకు పేరుపెట్టెను. అట్లే కాళిదాసు శకుంతలా ప్రాధాన్యమునుబట్టి అభిజ్ఞాన శాకుంతల మని తన నాటకమునకు పేరు పెట్టెను తాను గావించిన నూతన కల్పన ననుసరించి కవికుల గురువు ఈ పేరు పెట్టెను అభిజ్ఞాన మనగా ఆనవాలు.

దుష్యంతుడు దుర్వాసుని శాపముచేత మరచిపోయిన శకుంతలను తానిచ్చిన ఉంగరము గుర్తుచేతనే మరల జ్ఞప్తికి తెచ్చుకొనెను ఈ అంగుళీయక వృత్తాంతము మూలకథలో లేదు కాళిదాసు కల్పించినదే. అట్లైనచో భారతమున దుష్యంతుడు శకుంతలను గుర్తించుటకు ఆధారమేదా? లేదని మనకు స్థూలదృష్టికి తోచును కాని శకుంతలయే తనను గుర్తించుటకు ఆనవాలుగా దుష్యంతునికి తన కుమారుని చూపుచున్నది 'బాలార్క తేజుడగు ఈ బాలుడు నీకొడుకు'

'విపరీత ప్రతిభాష లేమిటికి ఉ
  ర్వీనాథ! ఈపుత్రగా
త్రపరిష్వంగ సుఖంబు చేకొనుము ము
  క్తాహారకర్పూర సాం
ద్రపరాగ ప్రసరంబు చందనము చం
  ద్రజ్యోత్స్నయున్ పుత్రగా
త్రపరిష్వంగము నట్లు జీవులకు హృ
  ద్యంబే కడున్ శీతమే'

అని నన్నయ్యకూడ పలికించినాడు దుష్యంతునకే గాదు ఏభర్తకైనను భార్యను గుర్తుతెచ్చుకొనుటకు సంతానమే ఆనవాలుగా పనిచేయును. అందువలన దుష్యంతుడు శకుంతలను గుర్తించుటకు ప్రధాన అభిజ్ఞానము సర్వదమనుడని పేరుపొందిన భరతుడే భరతుడనగా దేహమును భరించిన జీవుడు అనగా ఈ ప్రకృతిలో మానవుడే భగవంతుడు, ప్రకృతి శక్తితో గూడి జీవులను సృష్టించెను అట్టి ప్రకృతియే లేకున్నచో భగవంతుడు కూడ సృష్టిచేయుజాలడు. దీనినే శ్రీశంకరులు సౌందర్యలహరిలో 'శివ శ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్, న చే దేవం దేవో న ఖలు కుశలః స్పందితు మపి' అని అభివర్ణించినారు. కనుక భగవంతుడు ఒక డున్నాడనియు అతడు ప్రకృతిశక్తితో గూడి జీవులను సృష్టించె ననియు తెలుసుకొనుటకు మనమే ఆగారము అనగా అటి జానము పొందుటకు మానవుడే అభిజ్ఞానము. తన పుట్టుక వలన మానవుడు ప్రకృతిశక్తిని గుర్తింపవలెను. ఈపరమ సత్యమును సందేశముగా నందించుటకు కాళిదాసు అభిజ్ఞానశాకుంతల నాటకము రచించెను ఇందు మారీచాశ్రమమున దుష్యంతుడు భరతుని చూచియే శకుంతలను తన భార్యగా గుర్తుపట్టినట్లు కాళిదాసు బహునిపుణతతో వర్ణించెను దీనికి స్థూలమైన ఒక నాటక కల్పనయే అంగుళీయక వృత్తాంతము నిజమునకు అంగుళీయకము చేత దుష్యంతుడు శకుంతలను గుర్తింపగల్గెనా? ఆమెను గుర్తుతెచ్చుకొనుటకు అత్యల్పముగా మాత్రమే అభిజ్ఞానము పనిచేసినది. అసలైన అభిజ్ఞానము భరతుడే పారమార్థికమైన ఈ అభిజ్ఞానము మనకు కల్గుటకే కాళిదాసు తననాటకమునకు అభిజ్ఞానశాకుంతల మని సార్థక నామకరణము గావించెను.

మాళవికాగ్ని మిత్రము -

ఇందు ప్రధానమైన నాటకకల్పన అశోకవృక్ష దోహదము ఇదికూడ స్థూలదృష్టికి రాణియైన ధారిణీదేవి ఉద్యానవనములోని పుష్పింపని ఒక అశోకవృక్షమునకు మాళవికచేత దోహదముచేయించినట్లు కవి కల్పించెను ఇందు వాస్తవమునకు ఆ అశోకవృక్షము నాయకుడైన అగ్నిమిత్రుడే అతనికి మాళవికపై ప్రేమ కలుగునట్లు చేయుటయే అసలైన దోహదము. ఇదియే నాటకముయొక్క కార్యము ఫలాగమము కూడ నిదియే ఈ కార్యము నిర్వహించినవాడు గౌతముడను విదూషకుడు కనుక స్థూలముగా ధారిణీదేవి మాళవికచేత అశోకవృక్ష దోహదము చేయించినట్లు కనిపించినను అసలు జరిగినది విదూషకునిచేత అగ్నిమిత్రునకు ప్రేమ దోహదము అట్లే అభిజ్ఞానశాకుంతలము కూడ దుష్యంతుడు శకుంతలకిచ్చిన ఉంగరము అభిజ్ఞానముగా

స్థూలదృష్టికి గోచరించినను శకుంతలయే తనను గుర్తించుటకు దుష్యంతునకు భరతుని అభిజ్ఞానముగా నిచ్చినది

**మాళవికాగ్ని మిత్ర పరమార్థము**

మాళవికాగ్ని మిత్రమందలి పరమార్థమును గ్రహించినచో ఈ కల్పనలోని ఔచిత్యము స్పష్టమగును. అగ్నిమిత్రుడనగా అగ్నిని మిత్రుడుగా గల్గినజీవుడు జీవులమైన మనకు క్షుధాగ్ని, కామాగ్ని, జ్ఞానాగ్ని, క్రోధాగ్ని రూపములలో అగ్ని మిత్రుడుగా నున్నాడు మాళవిక, పట్టపురాణియైన ధారిణీ దేవికి పరిచారికగా నున్నది ధారిణీదేవి యనగా అనంతమైన ప్రకృతిసంపద ఆమె పరిచారిక మాళవిక అనగా అంతట పరిచరించుచున్న దని అర్థము. అనగా మనచే అనుభవింపబడు పరిమితసంపద అన్నమాట. ఈ సంపద మన మనుభవించుటకు ఒక దోహదము అవసరమగుచున్నది ప్రకృతి ఆ సంపద నిచ్చుట ద్వారా వ్యాపారస్థుడు ఆ సంపదను సౌందర్యముగా ప్రదర్శించుట ద్వారా ఆ పదార్థములపై కోరిక కలుగు చున్నది దానికి దోహదము చేయువాడే విదూషకుడు అనగా పదార్థముల ననుభవించవలె నని ప్రోత్సహించు దేహముయొక్క స్వభావము అందువల్లనే కాళిదాసు ఇతనికి గౌతముడని పేరు పెట్టెను గౌః-తమ అనగా ఉత్తమమైన గోవు అని అర్థము గోవు అనునది మన దేహమునకు, వాక్కునకు, సంకేతము. ఒక సుందరమైన రూపకరమైన పదార్థమును చూచినపుడు దానిని పొందవలెనను కోరిక కలుగుట, అదిసంకల్పముగా స్థిరపడుటయే గౌతముని దోహదము. ఈ దోహదము వలననే జీవుడు ఆహారమును స్వీకరించుట, వివాహము చేసుకొనుట, జీవితమున పురోగమించుట జరుగుచున్నవి. ఇట్టి పురోగమనమే ఉద్యాన వన విహారముగా కల్పించబడినది. ఉత్ + యానము = పురోగమనము ఈవిధముగా కవికులగురువైన కాళిదాసుని నాటకకల్పనలు మానవజీవిత నాటక రంగమునందలి వాస్తవిక సన్నివేశములై సృష్టిపరమార్థము స్ఫురింపజేయుచు అతనిని కవికుల గురుత్వమునకు పట్టము గట్టుచున్నవి

# ఆధునిక నవలికకు శ్రీ కుటుంబరావు చేకూర్చిన సంపద

(గతసంచిక తరువాయి)

- శ్రీ సోమసుందర్

రామ్మూర్తి దృష్టిలో మొదటినుంచి ఉద్యోగం కూలిపనితో సమానం కాని ఈ కొత్తపరిస్థితులు అతనికి ఉద్యోగం చేస్తే తప్ప తీరని విషమపరీక్షను గురిచేశాయి మద్రాసులో ఒక పెట్టుబడిదారుడు పత్రిక పెట్టదలచి నట్లు ఒక మిత్రుడు రాయబారం వస్తాడు ఎంత జీతం యిస్తాడని అడగడం కూడా అతనికి నామోషీయే! మద్రాసు వెళ్ళి కళావాణి కార్యాలయంలో చేరుతాడు

పత్రికను ఫక్తు ఆధునిక సాహిత్య పత్రికగా నడప నిశ్చయించుకున్నాడు రామ్మూర్తి అడవి బాపిరాజు ముఖచిత్రం వేస్తానన్నాడు. చింతాదీక్షితులు మునిమాణిక్యం, శ్రీనివాస శిరోమణి, నోరీ త్యాగులు కథలు పంపుతామన్నారు విశ్వనాథ, కొడాలి కొమాండూరి, నండూరి ప్రభృతులు కవిత లిస్తామన్నారు. కళావాణి ప్రారంభసంచికను పత్రికలన్నీ స్వాగతం పలికాయి సాహిత్య చర్చలో, నవ్యకవిత్వ ప్రశంసావ్యాసాలో, వస్తుందేవి ఒకనాడు రామ్మూర్తి దగ్గర కోకుర్రాడు వచ్చాడు మాటలసందర్భంలో - భావకవిత్వం అవసానదశకు చేరిం దని, ఎంతోకాలం దక్కదనీ కొంచెం ఘాటుగానే అన్నాడు రామ్మూర్తి ఆశ్చర్యపోయాడు అలాంటిమాట లతను ముసలాళ్ళ నుంచే విన్నాడు కుర్రాళ్ళు అలాఅనడం ఎరగడు. అది భవిష్యద్వాణిలా తోచి వణకు పుట్టిం దతనికి

'కళ ప్రేతకుణ్ణి ఆవరించాలి. వివశుణ్ణి చేసి ఒక చోటనుంచి ఎత్తి మరోచోట పెట్టాలి' అని ఆ కుర్రాడినోట పలికిస్తాడు కుటుంబరావు.

రామ్మూర్తి ఏకీభవించడు అతన్నించి కొన్ని విషయాలు తెల్సుకుందామని ప్రశ్న వేస్తాడు

'నేటికవులలో తెలుగువాక్కు ఉన్నవాళ్ళు బహుకొద్దిమంది గురజాడ అప్పారావు దగ్గర ఈవాక్కు కనిపిస్తుంది బసవరాజులో కనిపిస్తుంది. నండూరి సుబ్బారావులో కనిపిస్తుంది జ్ఞాపకం ఉంచుకో తగ్గ కథలు రాసేవా ళ్ళెవరూ లేరు ఒక్క గుడిపాటి వెంకటాచలం మాత్రం చక్కని శిల్పంతో కథలురాస్తాడు ఈ శిల్పం పైనుంచి దిగుమతి చేసినా అతివేగంగా తెలుగువాళ్ళ సొత్తుఅయింది కాలక్రమేణా మిగిలేది చలం గారు తెచ్చిన శిల్పమే ఆయన తెచ్చే కథావస్తువు కూడా దిగుమతిసరుకే. పాశ్చాత్య నాగరికతా వ్యామోహం తప్ప ఏమీ కనిపించదు సాంఘికకట్టుబాట్లు ఎందుకు వచ్చిందీ ఆయనకి తెలియదు ఆయనకోరే స్వేచ్ఛాయుత సంఘం ప్రపంచాల్లో ఎక్కడా ఉండదు వంటింటికీ వసారాకీ మధ్య గోడ కట్టుకుంటాం స్నానాల గది అయితే కటికీలకి మరింత భద్రంగా తలుపులు పెట్టుకుంటాం స్వేచ్ఛ కావాలని ఎవరిమూ వెళ్ళి బట్టబయలులో నివసించం'' అని కుర్రాడిచేత అన్పించిన మాటలు కుటుంబరావు వైమర్శికాభిప్రాయాలే! ఆయన ప్రధానంగా మేధావి, ఆలోచనాపరుడు అందుకే

ఆయన రచనలలో సైతం ఆలోచనకే అధిక ప్రాముఖ్యం కలిగిస్తారు కళాశీలం, అనుభూతి ప్రేరణా ద్వితీయ శ్రేణిలో నిలుపుతారు

ఆయన సృష్టించిన పాత్రలొక్కటీ ఆయన్ని పోలనే పోలవు అనడమూ అంతే అబద్ధం రచయిత సృష్టించే పాత్రలన్నీ అతని మేధాజన్యాలే! అయినా ప్రతి పాత్రకూ సమాజంలో నమూనాలుంటాయి అంటే వివిధ ధోరణులకు ప్రతిబింబాలుగానే కుటుంబరావు పాత్రలు సృష్టిస్తారు అనేక పాత్రలకు రచయిత పోలికలుండటం అసాధారణమేమీ కాదు ఒక్కో పాత్రకు మరింత ఎక్కువ పోలిక ఉండవచ్చు అంతమాత్రంలో ఆ పాత్ర రచయిత స్వీయజీవిత ప్రతిబింబమే అనడం సరైన విమర్శ ధోరణి కాదు. ప్రతి రచయితా సాంఘిక జీవే, కనుక ఒక పాత్ర ఒక సన్నివేశంలో వ్యవహరించిన తీరును తన స్వీయానుభవం మీద, సామాజిక వాస్తవికత మీదా గీటు వేసి చూసుకుంటాడు

ప్రతివ్యక్తి జీవితమూ బహుముఖీనమైనది ప్రతివ్యక్తిలోనూ అనేక ఆర్గ్యుమెంట్లూ - కౌంటర్ ఆర్గ్యుమెంట్లూ ఉంటాయి. వివేకమూ ఉంటుంది సెంటిమెంటూ ఉంటుంది అవన్నీ నిశిత దర్శనం గల రచయితకు భిన్న విభిన్న పాత్రల సృష్టికి వాటి ఊహాపోహాలుగా, వైయక్తిక లక్షణాలుగా ఉపయోగపడతాయి. రచయిత సృష్టించిన పాత్రలన్నీ సామాజికంగా ఎంత వాస్తవికమైనవో అవి అతని మానసపుత్రులుగా సైతం అంతే వాస్తవికమైనవి. పాత్రలన్నీ రచయిత ప్రవృత్తులకు ప్రతిబింబాలుగా రూపొందక తప్పదు

ఉదాహరణలు తీసుకోదలిస్తే ఈ అరుణోదయంలోనే ఎన్నో పాత్రలు కుటుంబరావు వ్యక్తిత్వంతో పోలికకలిగి ఉంటాయి అంతమాత్రంలో ఫలానా పాత్ర రచయితే అని ముద్రకొట్టి ఆనందించేవారు ఏ నూతన తీరాన్నీ చేరుకోలేరు. రామ్మూర్తి పాత్ర దాదాపు పతనం నుంచి పతనానికే ప్రయాణిస్తుంది. అయినా ఆ పాత్ర కుటుంబరావు జీవితంతో పోలికలున్నదే అని లాగడానికి అవకాశం లేకపోలేదు 1930 లో సంభవించిన దారుణ ఆర్థిక సంక్షోభం కుటుంబరావు జీవితాన్ని ఎంతో మార్చివేసింది. అలాగే రామ్మూర్తి జీవితాన్ని మార్చివేసింది. కుటుంబరావు సృజించిన ఎన్నో పాత్రలు దీని ప్రభావానికి లోనైనవే.

రచయిత తాలూకు విస్తృత బహుముఖ జీవితాన్ని ఒక చిన్న పాత్ర బతుకుకు కుదించి సిద్ధాంతం చేయబూనడం మాత్రం శూన్యవాదమే కాగలదు

నామరహితుడైన అక్రవాడు సాగించిన చర్చ మాత్రం రామ్మూర్తికి జ్ఞాపకంలో మిగిలిపోయింది అతడు తనకన్న విశాలంగా చూస్తున్నాడనేదీ అతనికి తెలుస్తున్న విషయమే ఇతని వాదంతో రామ్మూర్తి అంగీకరించలేకపోయినా జయం తనవాదానికే అనుకొనే అవకాశమూ ఏర్పడలేదు పైగా నవ్యసాహిత్య వీథిలో మణిదీపాల్లో మెరసిన మహాకవుల నుంచి కూడా నాసిరకం రచనలే వస్తున్నాయి దీనిని బట్టి కూడా స్వర్ణయుగం అంతరించిందా అనిపిస్తోం దతనికి భావకవిత్వం పై యువకులలో విద్వేషం పెరిగిపోతోంది వెక్కిరింపులా హేళన పద్యాలూ కళావాణి ప్రచురణార్థం వచ్చి చేరుతున్నాయి ఇదంతా యుగాంతాన్ని సూచిస్తున్నదేమో అని అతనూ అనుమానించక పోలేదు.

ఐతే ఇదంతా వ్యక్తుల పరంగానే ఆలోచిస్తున్నాడు కాని, ఆర్థిక సంక్షోభం ప్రజల మనస్తత్వాన్ని ఎలా మార్చిందీ అతనికి అవగాహన లేదు 'గుడ్డుపగిలి బయటికివచ్చిన పిల్ల తిరిగి గుడ్డులోకి వెళ్ళి తన చుట్టూ తుంపులంటించుకోవాలన్నట్లు ప్రవర్తిస్తున్నాడు' రామ్మూర్తి! (పుట 33)

'గ్రామాలలో వర్ణవ్యవస్థ కనిపించినంత స్పష్టంగా నగరాలలో వర్ణవ్యవస్థ కనిపించడం ప్రారంభించింది. (పు 35) అనే పరిశీలన చేస్తారు రచయిత యుగయుగాలుసాగిన భూస్వామ్య జమీందారీ వ్యవస్థ సామ్రాజ్యవాదుల పాలనలో పెట్టుబడిదారీ (బూర్జువా) సమాజంగా పొందుతున్న పరివర్తనం దీని ద్వారా సూచితమైంది ఇది ఈ దేశంలో దాదాపు 20వ శతాబ్దంపు ప్రారంభంనుంచీ క్రమశః స్పష్టపడుతున్నదే! అడుగువర్గంలో బ్రతుకుతున్న వాళ్ళు పైవర్గానికి ఎక్కరావడానికి ప్రయత్నించడమూ కనిపిస్తున్నదే! రామ్మూర్తి జీవితంలో వెంకటేశ్వర్లు అనే ఒకపాత్ర ప్రవేశించి మౌలికమైన మార్పుల కెన్నిటికో దోహదం చేస్తుంది.

వాడొక చిత్రమైనవాడు. చొరవా, మాటకారితనమూ వాడి నైజాలు ఏదో పత్రికలో ఉద్యోగం చేస్తున్నాడు. అకస్మాత్తుగా ఒకనాడు ఉద్యోగం మానేస్తున్నాననీ, నాటకాల కంపెనీ పెడుతున్నాననీ చెబుతాడు రామ్మూర్తిని ఒక సాంఘిక నాటకం రాయడానికి పురమాయిస్తాడు మొదట్లో నమ్మలేకపోయినా, వాడే రామ్మూర్తిని పైవర్గపు మెట్లెక్కడానికి ఎగసనతోస్తాడు

ఆడవేషాలు ఆడవాళ్ళే వేయాలన్న బళ్ళారి రాఘవగారి సిద్ధాంతం చర్చనీయమవుతుంది స్థానంవారి కళానైపుణ్యం సోదిలోనికి వస్తుంది 'అద్దంకి, రామనాథశాస్త్రి పద్యాలు చదివేతీరుతో పోలిస్తే మా నాసి వెధవ లెక్కడ నిలబడతారు' అంటాడు వెంకటేశ్వర్లు అతని పథకాలపై తనకేమీ నమ్మకం లేదని రామ్మూర్తి చెప్పలేదు.

ఆరోజు తర్వాత రెండు నెలలవరకూ రామ్మూర్తి వెంకటేశ్వర్లును దాదాపు మరచిపోయాడు కాని గయోపాఖ్యానం విజయంగురించి, సుభద్ర నటనాకౌశలం గురించీ ఆంధ్రపత్రికలో ప్రశంసలు పడితే చదివి ఆశ్చర్యపోయాడు అతనికో ఉత్తరమే వచ్చింది '25వ తేదీకే పట్నంవస్తున్నాం వెయ్యి వచ్చేసింది నాటకం పూర్తి అయిందా?' అని వెంకటేశ్వర్లు రాశాడు. రామ్మూర్తి నమ్మలేకపోయాడు గత్యంతరం లేదు ఇగవై అయిదో తేదీకి వాడు రానే వచ్చాడు. రామ్మూర్తి నాటకం రాయలేదు. కాని తన రెండో కథ ప్రాయశ్చిత్తం నాటకీకరిద్దామని రామ్మూర్తి నిశ్చయించుకున్నాడు. కథా,మార్పులూ వెంకటేశ్వర్లుకు చెప్పాడు నాటకం తొందరగా రాసియిమ్మనీ ఐదువందలు, ప్రతిఫలంగా తక్షణం తీసుకోమనీ అతడు చెప్పాడు

ఈసందర్భంలో రచయిత రామ్మూర్తి మనసులో ఎరిగే భావాలను గురించి చక్కని పరిశీలన చేస్తాడు 'పెద్ద పెద్ద నటులు తనకోటి రచయితమీద ఆధారపడరనీ - ముందు రాబోయే నాటకకర్తలకి పోషకులు వెంకటేశ్వర్లు కన్నహీనంగా ఉంటారనీ రామ్మూర్తి తెలుసుకోలేడు' అని పుట 47లో అంటారు

మానవ జీవితం సమస్త జంతు జాలం నుంచీ విడివడి, సాధించిన ఉత్తమ సంస్కారం ఒక్కటే పరిశీలనా, ఆలోచనా! పరిశీలన అంటేనే గతానుభవాన్ని వర్తమానపు అనుభూతితో పరిసరాల ప్రమేయంతో తైపారువేసుకోవడం ఆలోచన అన్నది నేటినుంచి రేపటివరకూ జీవితవిధానాన్ని రూపొందించుకోవడం కాని సరిగ్గా ఈ రెండు సాధారణ శక్తులే నేటి మన నవలా మణుల నవలా సాహిత్యంలో కరువై తలబరువై పోతోంది. కన్నీళ్ళూ కార్పణ్యాలూ, మితిమీరిపోతున్నాయి జాతికి నీరసం కలిగిస్తున్నాయి

కుటుంబరావు ప్రతిసన్నివేశంలోనూ పరిశీలనతోనూ ఆలోచనతోనూ మనసుకు పనికల్పిస్తారు హృదయరంజకత్వం చదివించడంవరకే పరిమితం చేస్తారు. హృదయం మీద విపరీతంగా రాపిడి కలిగించి ఫీలింగ్సునుపిండుతూ తమముప్పీ గడపుకోరు!

మరునాడు తన గుంపును వెంటబెట్టుకొని వెంకటేశ్వర్లు రామ్మూర్తియింటికి వచ్చాడు 'ఒక్క మెయిలైనా దీపారాధన లేదు' వాళ్ళాడిన నాటకాలకు డబ్బు ఎలావచ్చిందో రామ్మూర్తి ఊహించుకోలేకపోయాడు. వాళ్ళంతా అతనంటే హెడ్మాస్టరు ముందు పిల్లల్లా భయపడ్డారు అలగాజనం కళాప్రదర్శనలకి వచ్చిందా అనిపించింది రామ్మూర్తికి అకస్మాత్తుగా చెవిలో కాకి అరచినట్లు ఉన్నట్టుండి ఆడకూతురు కాస్త కోరు చేసుకుంది 'మనకు నాటకం రాస్తావుం దీరేనా?' అని కాఫీ త్రాగడం చేతగాని ఒక త్యాష్టుడు చాప తడిపేశాడు.

తీరానాటకం చూస్తే రామ్మూర్తికి దిమ్మతిరిగిపోయింది అలగా జనంలోంచి వచ్చిన వాళ్ళే సుశిక్షితులైన నటులైఅద్భుతంగా రక్తికట్టించారు. ఆత్యాష్టుడే కృష్ణ వేషధారిగా పేల్చిపారేశాడు, వాడగొంతు అద్భుతంగా పలుకుతుంది బాలగంధర్వనూ, పెండార్కర్‌నూ అవలీలగా దించిపారేశాడు మామూలుగా మాలకాకిలా కనిపించిన సుభద్ర వేషంలో అప్సరసలా రాణించింది. అవలీలగా చేసింది స్థానంలాటివాడు కూడా నటనలో ఎంత శ్రమపడతాడో ప్రేక్షకుడికి తెలిసిపోతుంది.

వెంకటేశ్వర్లు నాటకం కాగానే రామ్మూర్తిని కళ్యాణిని స్టేజిమీదికి రమ్మని ఆహ్వానించాడు సుభద్ర వేషం విప్పేస్తోంది. 'యాంఖండీకూస్తైయినా నాటకం రగితి కట్టిందా?' అన్నదామె. రామ్మూర్తికి మబ్బువిడినట్లయింది మళ్ళీ కాకి ప్రత్యక్షం! కాని ఆకాకి పరిచయం కోసమే మహామహులంతా పడిగాపులు పడుతూ ఎగబ్రాకుతున్నారు పెద్ద పెద్ద నూట్లు స్టేజిపైకి వచ్చాయి!

ఈ నాటకప్రదర్శనని గురించి హృదయపూర్వకంగా స్తుతిస్తూ కళావాణి పత్రికలో 'మూర్తి' కలం పేరుతో సమీక్ష ప్రచురించాడు సమకాలీనకళాదృష్టిని గురించికాని, విలువల మార్పును గురించికాని తాత్త్వికవిమర్శ చేయలేదు. ప్రఖ్యాత స్టేజినటులు వేషాలైన విప్పకుండా ఆనందబ్రహ్మను గురించి ఉపన్యాసాలు దంచుతూనే ఉన్నారు అదే ఈజాతి కళవాటయింది. సాహిత్యంలో కూడ ఇంతేజరిగింది నవ్యకవులకీర్తి దిగంతాలకు వ్యాపించిన కొద్దీ క్షీణించింది.

ఆ కాలలోని సర్వ కళారంగాలూ వ్యక్తి కీర్తిగానంపైనే బ్రతికాయి తప్ప కళాభిరుచిని ప్రజలలో వ్యాపింపచేయలేదు వారి స్థాయిని పెంచే ప్రయత్నం చేయలేదు నిజమైన కళాభిజ్ఞులుమాత్రం అభ్యుదయమార్గంవైపు వెళుతున్నారు 'భావకవిత్వం కీర్తి ఉడిగిపోతుండగానే శ్రీశ్రీ మహాప్రస్థానం ప్రారంభమైంది. మరో ప్రపంచబీజం సాహిత్యక్షేత్రంలో పడింది' అంటారు కుటుంబరావు ఈయన ఒక సాహితీపరుని జీవితం చిత్రించడం వల్ల సర్వసాహితీ సమస్యలూ యథేచ్ఛగా చర్చించబడ్డాయి

( సశేషం

# ఉపనిషత్తులు - భక్తి

– శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, ఎం ఏ

‘ఉప’, ‘ని’ ఉపసర్గలుగాగల ‘సద్’ ధాతువునుండి ‘ఉపనిషత్తు’ అను పదము పుట్టినది ‘దగ్గఱగా కూర్చుండు’ అని దీని వాచ్యార్థము ‘భగవత్తత్త్వమునకు సన్నిహితముగా’ అని చెప్పవలయును భగవత్తత్త్వమును తెలియజెప్పు గురువు సమీపమున కూర్చుండి నేర్వవలసిన విజ్ఞానభాండారము ‘ఉపనిషత్తులు’ మనస్సును విషయ వాసనలనుండి మరల్చి, దైవసంపదకు దగ్గఱగాఁ జేర్చునవి ఉపనిషత్తులు.

‘శ్రుతి శిరస్సీమంత ముక్తామణు లుపనిషత్తులు సనాతన ధర్మమూలము లుపనిషత్తులు నిర్విశేష బ్రహ్మజ్ఞాన నిధు లుపనిషత్తులు.’

ఉపనిషత్తులు కేవలము జ్ఞానమార్గమును మాత్రమే ప్రవచించుట లేదు భక్తి కర్మముల చర్చయు వాని యందు గలదు వేదముల చివరి భాగములే ఉపనిషత్తులు. ‘కాండత్రయాత్మకో వేదః’ కదా! వేదములు ఉపాసనా (భక్తి), కర్మ, జ్ఞాన కాండలను వివరించినవి. సర్వోపనిషత్సారమైన భగవద్గీత యందును భక్తి, కర్మ, జ్ఞానములు మూడింటి ప్రసక్తియు కానవచ్చును వేదములందలి జ్ఞానకాండయే ఆరణ్యకములు అందున్నవే ఉపనిషత్తులు. జ్ఞానకాండ వేదముల చివరిభాగమున నుండుటచే దీనిని ‘వేదాంత’ మనియు అందురు

భక్తిచేత జ్ఞానము కల్గు నని, అట్టి జ్ఞానము ముక్తిదాయక మని ఉపనిషత్తుల ప్రవచనము. ఇది భారతీయాత్మ వేదములేమి? ఉపనిషత్తు లేమి? భగవద్గీత యేమి? భారతీయాధ్యాత్మిక విద్యాతత్త్వమంతయు పైసూత్రమును పరివేష్టించి యున్నది

‘ఈశావాస్య మిదం సర్వం’ – భగవంతుని సర్వాంతర్యామిత్వమును నిర్దేశించుచు ప్రారంభమైనది ఈశావాస్యోపనిషత్తు దృశ్యమానమైన ఈ ప్రపంచమంతయును దైవస్వరూప మని భావము ప్రపంచమంతట నిండియున్న సర్వోత్కృష్టమైన శక్తి దైవము అట్టి దైవము నెడ ఆరాధనభావము గలుగుటకు తొలుత భగవంతుని సర్వాంతర్యామిత్వ మెఱుక పడవలయును కదా! ఈశ్వరాంశయే ప్రపంచ మని తెలియవలయును అట్టి నమ్మికలోనే, అవగాహనలోనే, భక్తికలదనుట అనాదిగా మన సిద్ధాంతము ‘సర్వము తానయైన వాని నెఱుంగుట’ యనగా జ్ఞానము సర్వమును పరమేశ్వరస్వరూప మను నీభావమే, అనగా నిట్టి జ్ఞానమే మానవుని మనస్సును భక్తి వంకకు మరల్పజాలును భక్తి, జ్ఞాన మార్గములు పరస్పర దోహదకరములై కన్పట్టుచున్నవి గదా!

ఉపనిషత్తులలో గల భక్తిని గూర్చి ‘ముండకోపనిషత్తు’, ‘తొలుదొల్త సాధకునకు, పరమాత్మయందు లీనమై తన్మయత్వమును పొందిన అంతఃకరణము ప్రధానము అట్టి అంతఃకరణముతో, ఉపాసన (అనగ భక్తి) చేత పదును పెట్టబడిన శరమును ఉపనిషదుక్తమైన వింటియందు సంధింపదగును అక్షరపర బ్రహ్మమే లక్ష్యము’ అని పేర్కొనుచున్నది.

‘ధను ర్గృహీత్వౌపనిషదం మహాస్త్రం
శరం హ్యుపాసా నిశితం సంధయీత
ఆయమ్య తద్భావగతేన చేతసా
లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి’–

అట్టి ఉపనిషదుక్తమైన ధనువు ప్రణవమే – అనగా ఓంకారమే

‘ప్రణవో ధనుః శరో హ్యాత్మా
బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే।
అప్రమత్తేన వేద్ధవ్యం
శరవత్తన్మయో భవేత్॥’

‘ప్రణవమే ధనుస్సు, ఆత్మయే శరము, బ్రహ్మమే లక్ష్యము లక్ష్యమును భేదించు యత్నములో శరమువలె తన్మయత్వమును పొందు’ మని ముండకోపనిషత్తు చాటుచున్నది లక్ష్యసిద్ధిగల అంతఃకరణముతో ప్రణవోపాసనము గావించినచో బ్రహ్మపదమును చేరగల మనుట దీని సారాంశ మని గ్రహింపవచ్చును

ప్రణవోపాసనమునందలి విశిష్టతను కఠోపనిషత్తుకూడ చెప్పుచున్నది

‘ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ
ఏతద్ధ్యేవాక్షరం పరమ్।
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా
యో యదిచ్ఛతి తస్య తత్॥’–

‘ఏతత్’ అనగా ఇదియే అది ఓంకారము అనగా ప్రణవమే అక్షర పరబ్రహ్మము ‘ఏతత్ హి ఏవ అక్షరం జ్ఞాత్వా’ అనగా ప్రణవమును బ్రహ్మరూపమున ఉపాసించుట సర్వోత్కృష్టమైన పరబ్రహ్మమును తెలిసిన వారికి అభీష్టసిద్ధి యగును సగుణ, నిర్గుణ తత్త్వ రహస్యమిందు గలదు.

సర్వప్రాణి హృదయాంతర్యామి యైన భగవంతుని ప్రతీకను కల్పించుకొనుటయే సగుణ భక్తి యని, అది నిర్గుణ భక్తికి సాధక మని భాగవత ప్రవచనము 'ఏతత్ హి ఏవ అక్షరం జ్ఞాత్వా' అను నీ యుపనిషద్వాక్యము అక్షరపర బ్రహ్మము నెఱుంగ వలయు నని సూచించుచున్నది

శంకర రామానుజు లిర్వురును 'ఏతత్ హి ఏవ అక్షరం జ్ఞాత్వా' అనగా ప్రణవము బ్రహ్మ రూపమున ఉపాసించుట అనియే అర్థము చెప్పియున్నారు

ఓంకారము నుపాసించుట మున్నగు దానికే 'ప్రతీకోపాసన' మని పేరు విగ్రహారాధన మెట్లు ఏకాగ్రతకు తోడ్పడునో, ఇట్టి ప్రతీకోపాసనమును అట్లే లక్ష్యశుద్ధి గలుగుటకు సహకరించు నని వివేకానందస్వామి పేర్కొనెను

'మాండూక్యోపనిషత్తు' కూడ ఓంకార ప్రాశస్త్యమును చాటుచున్నది

'ఓ మి త్యేత దక్షర మిదం సర్వం
తస్యోపవ్యాఖ్యానం భూతం భవద్
భవిష్యదితి।
సర్వ మోంకార ఏవ। య చ్చాన్యత్
త్రికాలాతీతం తద ప్యోంకార ఏవ॥'

'ఓం కారమే సర్వస్వమని, భూతభవిష్యద్వర్తమానములు ఓం కారమందే గలవని, త్రికాలాతీతమైనది ఓంకారమే' అని మాండూక్యోపనిషత్ప్రవచనము

'ఓమితి బ్రహ్మ, ఓమితీదగ్ం సర్వం' ఇత్యాదిగా తైత్తిరీయోపనిషత్తు కూడ ఓంకారమే బ్రహ్మ మని, అదియే విశ్వమంతటను వ్యాపించియున్న దని పేర్కొనుచున్నది

ఆత్మ స్వరూపమును గూర్చి ఉపనిషత్తులు చర్చించినవి

'అణో రణీయాన్ మహతో మహీయా
నాత్మాఽస్య జంతో ర్నిహితో గుహాయామ్
తమక్రతుం పశ్యతి వీతశోకో ధాతుః
ప్రసాదా న్మహిమాన మాత్మనః'-

అని కఠోపనిషత్తు వివరించినది ఈ భావమునే భగద్గీతయు గ్రహించినది ఆత్మ అణువు కన్న అణువు అట్లే ఎంతో విస్తృత మైనది. ఇది ప్రాణియొక్క హృదయగుహయం దున్నది నిష్కామ భక్తుడు ఈశ్వరకృపచే దీనిని చూడ గల్గుచున్నాడు ఆత్మదర్శనమైన పిదప సాధకునిలో సర్వజ్ఞత, సచ్ఛీలతాది సద్గుణములు నెలకొనును. ఆతడు శోకము నుండి బయల్పడును

కాని, శంకరాచార్యుల వారు మాత్రము 'ధాతుః ప్రసాదాత్'కు బదులుగా 'ధాతుః ప్రసాదాత్' పాఠమును గ్రహించి, ఈశ్లోకమును వ్యాఖ్యానించినారు 'ధాతు' అనగా మనస్సు మొదలగు ఇంద్రియము లని, ప్రసాదగుణమనగా వినిర్మలమగుట యని, మనస్సు నిర్మలమైనపుడే ఆత్మదర్శనము సాధ్య మగునని శంకరాచార్యులవారు వివరించిరి ఈ చర్చలో భక్తిప్రసక్తి కలదా యని ప్రశ్నించిన వారును లేకపోలేదు. మనో నిర్మలత్వము భక్తిసాధన మని బుద్ధ్యేదము

మధ్వాచార్యులును 'ధాతుః ప్రసాదాత్' పాఠమునే గ్రహించిరి ఒకే వస్తువు అత్యల్పపరిమాణమున, అత్యధిక పరిమాణమునుకూడ కల్గినదై యుండుట యీ స్వభావవిరుద్ధముగా తోచును కాని ఆత్మవిషయమున నట్లుకాదు

ఆత్మశూన్యము ఈవిశాల విశ్వమును తనలో గర్భీకరించుకొన్న మహాశూన్యము విశ్వాసశూన్యులగు వారి కది కానరదనుటకు 'అణో రణీయాన్' అని చెప్పుదురు అట్లే మనసారా నమ్మిన వారికది విశ్వతోముఖముగ దర్శన మొసంగు ననుటకు 'మహతో మహీయాన్' అని పలుకుదురు

విశ్వాసము, శ్రద్ధ అనునవి భక్తికి సోపానములు

ఛాందోగ్యోపనిషత్తుకూడ ఆత్మయొక్క అణుస్వభావమును, మహాస్వభావమును వివరించుచున్నది 'సూక్ష్మాతి సూక్ష్మమైన వటవిత్తునుండి విస్తృతమైన మహావృక్షము కలుగుచున్నట్లు సూక్ష్మమైన సత్పదార్థమునుండి ఈ మహాప్రపంచము కలుగుచున్న' దని ఛాందోగ్యోపనిషత్ప్రవచనము

సమస్త ప్రపంచమునకు మూలభూతమైన పరమాత్మ మహాశక్తికదా! అట్టి శక్తి మనకు కానరాకున్నది అయినను,'అది కలదని యెట్లు గుర్తింపగల'మని శిష్యుడు ప్రశ్నింపగా, 'ఉప్పు, నీటిలో కలసిన పిమ్మట ఉప్పునీరేగాని, ఉప్పు వేఱుగా కానరాదు అయినను, నీటిలో ఉప్పున్న సంగతి జిహ్వకు తెలియును కదా! అట్లే అతిసూక్ష్మమైన పరమాత్మ జ్ఞానము శుద్ధసత్త్వగుణ ప్రధానమగు అంతఃకరణమునకే తెలియును' అని గురువు సమాధానము చెప్పెను కావున మనోనిర్మలత్వ మెంతేని యావశ్యకము. మనోనిర్మలత్వముచేత మాత్రమే అంతఃకరణము సత్త్వగుణప్రధానము కాగలదు. అట్టి అంతఃకరణముతో, అనుభవముతో పరమాత్మ స్వరూపము తెలియును

జీవాత్మ, పరమాత్మల సంబంధమును, కర్మఫలము విషయమై జీవాత్మ పరమాత్మల పాత్రను ఉపనిషత్తు లుగ్గడించినవి జీవాత్మ పరమాత్మలు శరీర మను ఒకే వృక్షము నాశ్రయించుకొని యున్న రెండుపక్షులు. అందొకటి అనగా జీవుడు కర్మఫలము ననుభవించు ననియు, రెండవ

డైన పరమాత్మ సాక్షి మాత్రు డనియు ముండకోపనిషత్తు చెప్పుచున్నది.

'ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః స్వాద్వత్త్యనశ్న
న్నన్యో అభిచాకశీతి ।'

అని ఉపనిషన్మంత్రము.

పరమాత్మలో ఐక్యమందినగాని జీవునకు సుఖశాంతులు లభ్యములు గావని ఈయుపనిషత్ప్రధానాంశము. ఇట్టియెడ పరమాత్మలో లీనమగుటకు ప్రధానమైన అవరోధము లెట్టివో ప్రశ్నోపనిషత్తు పేర్కొనుచున్నది.

'తేషా మసౌ విరజో బ్రహ్మలోకో
నయేషుజిహ్మమనృతంనమాయా చేతి॥'

అసత్యము. కుటిలస్వభావము. వంచన అనునవి మోక్షమార్గమున కవరోధములని తెలియుచున్నది గదా! అనగా శాశ్వతానందము నొసగు మోక్షమును సాధింపవలయునన్న మనోనైర్మల్య మెంతేని ప్రధాన మని గ్రహింపవలసియున్నది.

సర్వాంతర్యామియగు పరమాత్మనుండి లభించు ఆనందము మాత్రమే శాశ్వతమైనదని, తక్కిన వేవియును ఆనందములు కాజాలవనియు, తైత్తిరీయోపనిషత్తు చాటుచున్నది. భగవంతుడు రసస్వరూపుడు కావుననే ఇంద్రియాతీతమైన శాశ్వతానందము నొసగజాలును. 'రసో వై సః - రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి ..'- భగవంతుడు సర్వాంతర్యామి యను భావము కూడ తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడినది.

ఉపనిషత్తులందు తఱచుగ కానవచ్చు పదము 'బ్రహ్మము.'-తద్వన మిత్యుపాసితవ్యమ్' - అను వాక్యము పరబ్రహ్మమే భజనీయమగువస్తువు గావున ఉపాసింపవలసియున్న దని ప్రవచించుచున్నది. పరమేశ్వరుని పరమాత్కృష్టత్వము నిది చాటుచున్నది.

ఊర్ధ్వం ప్రాణ మున్నయత్యపానం ప్రత్యగస్యతి। మధ్యేవామన మాసీనం విశ్వేదేవా ఉపాసతే॥' అని కఠోపనిషత్తు. బ్రహ్మ ప్రాణవాయువు నూర్ధ్వదిశలో ప్రేరేపించి, అపానవాయువును నిమ్నదిశలో ప్రేరేపించుచున్నాడు. ఆతడు స్వయముగ సంస్తవనీయుడై హృదయమందు నెలకొని యున్నాడు. ఆతనిని దేవతలందఱును ఉపాసించుచున్నారు. దేవతలే ఆతని నారాధించుచున్నారనగా, మానవాళి యారాధింపవలయు నని వేఱుగ చెప్పవలయునా?

ప్రాణులందు ప్రాణమునకు ప్రేరకుడు జీవనస్థితి కారకుడుగావున సర్వాంతర్యామి యారాధనీయు డని గుర్తెఱుంగ వలసియున్నది.

జీవుల నుజ్జీవింపచేయు శక్తి పరమాత్మకే కలదు. ప్రశ్నోపనిషత్తులో సూర్యభగవానుని సర్వవ్యాపకత్వ, స్వయం ప్రకాశకత్వములు చెప్పబడినవి. ప్రకాశస్వరూపుడైన సర్వవ్యాపకుడు సూర్యభగవానుడు. తాను తెలియబడుచు, ఇతరవస్తువులను తెలియ జేయుచున్నాడు. సర్వులకు నుత్తమవ్యస్థానమై జీవుల నుజ్జీవింప జేయుచున్నాడు.

'విశ్వరూపం హరిణం జాతవేదం
పరాయణం జ్యోతిరేకం తపన్తం।
సహస్రరశ్మి శ్శతధా వర్తమానః
ప్రాణం ప్రజానా ముదయత్యేష
సూర్యః॥' -

బ్రహ్మైక్యమునకు భగవత్కృపయే కేవలము కారణము. బ్రహ్మ నారాధించు మానవులు భగవత్కృపా పాత్రులగుదురు. విద్యాబుద్ధుల వలని ఫలితము శూన్యము. భక్తి అత్యంతావశ్యకము.

'ఉత్కృష్టమైన శాస్త్రీ గ్రంథముల ద్వారా, విద్వద్భ్యుల ద్వారా, మేధాశక్తి ద్వారా, పాండిత్యము ద్వారా, ఆత్మస్వరూప మనుభూతము కాజాలదు. భగవత్కృపా సంపన్ను లగువారికి స్వయముగనే వ్యక్తము కాగలదు.' అని కఠోపనిషత్తు.

'నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా బహునా శ్రుతేన।
యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే
తనూగ్ స్వామ్॥'

జ్ఞానమార్గము కంటె భక్తిమార్గము సులభమైన దని కదా! మన విశ్వాసము. 'ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరా న్నిబోధత।' అని ప్రబోధించుచున్నది కఠోపనిషత్తు. అంతేకాదు. సాధనమార్గ మెంత దుర్గమమో పేర్కొనుచున్నది. 'క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదన్తి, - మన మార్గము దుర్గమమైనది కత్తివాదర వంటిది' అని విజ్ఞప్తి. దుర్గమమైన మార్గమనగా సాధారణముగా భక్తికంటె జ్ఞానమార్గమే. కావున ఉపనిషత్తులు జ్ఞానమార్గమును మాత్రమే ప్రవచించుచున్న వని నిర్ణయింపరాదు. సాధన పర్యవసాయి యగునందాక మనసు నిశ్చలముగ నిలచియుండుట చాలకష్టము. కావున భక్తిని సాధనముగ జేసికొని జ్ఞానమును, జ్ఞానము ద్వారా లక్ష్యప్రాప్తిని అపేక్షించు సాధకుడు కడుంగడు జాగరూకుడై యుండవలయు నని మాత్రమే పై మంత్రోద్దేశము. నిరంతరమైన అనన్యభక్తి గలవారెన్నటికిని లక్ష్యచ్యుతులు కాజాలరు గదా! 'న మే భక్తః ప్రణశ్యతి' అని భగవద్గీతలో భగవానుని ప్రమాణము. అసలు భక్తి, కర్మ, జ్ఞానములు మూడును మూడు భిన్నమార్గము లని భావింపరాదు. అవి ఒకే మార్గమునకున్న మూడు దశలు మాత్రమే. అయ్యది త్రిముఖమైన ఏక మార్గము.

( సశేషం )

## వనజీవనము

శ్రీ చింతలపూడి వెంకటేశ్వర్లు, ఎం.ఎ.

* తూరుపు తోఁపు వారకరియె తూ
రవ తుంకము లాడబారు నా
సోరలు ప్రమోదలం జివురు పా
త్రికలం గనువిచ్చి రెక్కల
ల్లారుచు పక్కిగూనలపు
లాఁతులం కారు యత్నేచ్చవృత్తినిం
పారఁ జరించు భాగ్యముల, బం
గరు కాంతుల నీనులాటలన్.

* మేయుచు, మోర లెత్తుచును,
మెల్లన దవ్వులకేగి అంతలో
డాయుచుఁ జెంగలించుచును
రావులు దప్పని దుప్పికూనలా
ప్రాయపు వాకిటం బురులు
బాతరలన్ తమ లేతనవ్వులం
బూయుచు నింపివైచు విరి
బోడులు, బోడలు, కోనబాలకుల్.

* చిదిమినఁ బాల్గారు చెక్కునిగ్గుల మధ్య
పచ్చకాంతుల నీను పచ్చబొట్టు;
పాలుపుగ వ్రేల్లాడు పూసపేరుల మధ్య
దోబూచులాడు చన్దోయికట్టు,
ఘన భరలో మేల్జఘన కుచంబులమధ్య
నాస్తి యన్పించు సెన్నడుము గట్టు,
కదలిన కాల్గీల్చు గండరాలకు మధ్య
నాట్యమాడెడు నట్టి నడకపట్టు,
ఉఁడిలేనట్టు, లేకయు నుండినట్టు
తలపులూరించు సిగ్గుదొంతరల మెట్టు,
భళిర! ఏ మందు నాకోయ బాలబెట్టు?
నేత్రముల పొంత దుప్పుల నిలువబెట్టు.

* పోడుపంటను పిట్టల పోరునుండి
కాయగ రెండంచె మంచెపై కోయపడతి
తాటిపై నిండుకుండల మాట మరచి
మగనిఁ బిలువంగ వచ్చెమెల్ల మారుపలుకు.

*పగటికి పగ్గము వేయుచు
సెగడులు పైపంచె మీద సెలకొల్పెడు నా
సిగదారులు రేయంతయు
సెగకాగుదురందుమీద చెలగెడు చలిలో.

## పానుగంటివారి రాధాకృష్ణ - భక్తిరసం

- శ్రీ డా. ఎస్. గంగప్ప, ఎం.ఏ.పిహెచ్.డి.

తెలుగు నాటకకర్తల్లో పానుగంటి లక్ష్మీనరసింహారావు గారికి ప్రత్యేక స్థానముంది. సరళమైన భాష, చక్కటి సంభాషణలు, హాస్యచతురత మొదలైన విశిష్టగుణాలు పానుగంటివారికి ప్రత్యేకతని ఆపాదించాయి. వీరి నాటకాలన్నింటిలోకి ప్రత్యేకస్థానం గలది వీరి రాధాకృష్ణ. ఇందులో భక్తిరసం - అంటే స్పష్టంగా చెప్పాలంటే - మధురభక్తి రసం పోషింపఁబడి ఉండడం దాని ప్రత్యేకతకు కారణం.

రాధాకృష్ణ నాటకంలోని భక్తిరసాస్వాదనకు ముందు భక్తి రస మన్న విషయాన్ని పరిశీలిద్దాం. 'భక్తి' అన్న పదం 'భజ్' ధాతువునుంచి పుట్టింది; అంటే భజించడం, భగవద్భజన మన్నమాట. సహజంగా చిత్తం పరమేశ్వరుని పాదారవిందాల కడకు పోవడాన్నే 'భక్తి' అంటాడు శంకరాచార్యుడు-

'అంకోలం నిజబీజ సంతతి రయ
స్కాంతోపలం సూచికా
సాధ్వీనైజ విభుం లతా క్షితిరుహం
సింధు స్సరిద్వల్లభమ్,
ప్రాప్నోతీహ యథాతథా పశుపతేః
పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా
సా భక్తి రిత్యుచ్యతే।
(శివానందలహరి - శ్లో - 51)

నారదభక్తిసూత్రాలలో 'సా తస్మిన్ పర(మ) ప్రేమరూపా' (సూ.-2) (ఆభక్తి పరమేశ్వరుని యెడల పరమప్రేమరూపంగా వున్నది) అని కలదు. అంటే ఈశ్వరునియెడ గల ఉత్తమ ప్రేమయే భక్తి అనబడుతుంది. ఇట్లే శాండిల్య భక్తిసూత్రాలలోను 'సాపరానురక్తి రీశ్వరే' (సూ-2) అంటే భగవంతుని యెడగల పరమప్రీతి (గాఢానురాగం) భక్తి అని చెప్పబడింది. పరమపూజ్యమైన ప్రీతియే భక్తి - భగవంతుని యెడగల ఆ పరమ పూజ్యభావమే భక్తి. ఇది తొమ్మిది విధాలు.

'శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం
సఖ్య మాత్మనివేదనమ్।'
(భాగవతం - సప్తమస్కంధం)

కాని చాలమంది ప్రాచీనాలంకారికులు భక్తిని రస మని అంగీకరించలేదు. దేవతా విషయకమైన రతి భావం కనుక భక్తి భావ మనియే వారి తలంపు. భక్తి రసం కాదని చెప్పినవారిలో ప్రథముడు ధనంజయుడు. కాంతావిషయమైన రతిస్థాయి భావాలలో పరిగణింపబడిఁది కాని పరమేశ్వర విషయకమైన రతి పరిగణింపబడలేదు. కాబట్టి పరమేశ్వరవిషయకరతి హర్షోత్సాహాది వ్యభిచారి భావాలలో పరిగణింపబడటం వల్ల ఇది రసత్వం పొందదు. ఇట్లే హేమచంద్రుడు, మమ్మటుడు, భక్తి రసం కాదని తిరస్కరించారు. జగన్నాథపండితరాయలు మొదట భక్తిని రస మని అంగీకరించి చివరకు నిరాకరించాడు. భగవంతుడు ఆలంబన విభావంగా రోమాంచాశ్రుపాతాదులు అనుభావాలుగా, హర్షాదులు వ్యభిచారులుగా కలిగిన భాగవతాది పురాణశ్రవణ సమయంలో అనుభవించే భక్తి రస మేల కాదు? ఇక్కడ భగవదనురాగ రూప

*'నిన్న'కు నేటికి 'రేపు'కు
చిన్నము భేదమ్ము లేదు జీవిత మెల్లన్
అన్నెము పున్నెము ఎరుగని
పున్నమకిరణంబులచటిపుత్తడిబ్రతుకుల్.

—(*)—

మైన రతియే స్థాయిభావం. కాని భక్తి దేవతావిషయకమైన రతికావడంవల్ల ఇది రసం కాదని, భావమని పండితరాయల అభిప్రాయం.

ఇది ఇలావుండగా ఈ భక్తిని రసమని నిరూపించిన వారు రూపగోస్వామి. భరతుని రస సిద్ధాంతాన్ని రాధామాధవులు ఆలంబనంగా రాధను, కృష్ణునిపై గల శృంగారరూపభక్తి, రసస్వరూపమైందని, ఆ రసప్రక్రియ నంతటిని సాంగోపాంగంగా నిరూపిస్తూ ఉజ్వలనీలమణి అనే గ్రంధాన్ని రచించాడు రూపగోస్వామి. నవరసాలకు భక్తిరసమే మూలమని, మధురరతియే భక్తిరస మని రూపగోస్వామి సిద్ధాంతం. తరువాత మధుసూదన సరస్వతి తన భగవద్భక్తి రసాయనంలో సముచితంగా భక్తికి రసత్వం స్థాపించాడు. ఈ ఇద్దరి సిద్ధాంతం ప్రకారం భక్తిరసానికి ఆలంబన విభావం భగవంతుడు. తచ్చరిత్రలు విభావాలు. భగవదాకార చిత్తవృత్తియే స్థాయిభావం. అదే భగవద్రతి. అనుభావాలు ఆ సందర్భంలోని నేత్రాది వికారాలు. వ్యభిచారులు నిర్వేదశంకా హర్షాదులు. ఇదే పరమానంద స్వరూపమైన భక్తి రసంగా పరిణమిస్తుంది. భారతీయేతరులు సైతం దేవతా విషయకమైన శృంగారం భక్తి అని పేర్కొన్నారు 'భగవద్భక్తిని శృంగారముగా మార్చుకొన్నవారికి ఉపాస్య వస్తువు పురుషుడుగాను, తాము స్త్రీలుగాను అనుభవమునకు వచ్చునందురు.

'సఏవ వాసుదేవోఽసౌ
సాక్షాత్పురుష ఉచ్యతే
స్త్రీప్రాయ మితర త్సర్వం
జగ ద్బ్రహ్మ పురస్సరమ్
'స్వామి త్వాత్మత్వ శేషిత్వ
పుంస్త్వాద్యాః స్వామినో గుణాః
స్వేభ్యోదాసత్వ దేహత్వ
శేషత్వ స్త్రీత్వ దాయినః'-

అనుట వారి మతం అని రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి మాటలు అక్షరాలసత్యం. ఇదే మధురభక్తి. భాగవతంలో ఈ మధురభక్తి రసపరిపూర్ణత చెందింది. భాగవతంలో సర్వమూ త్యజించి శ్రీకృష్ణుని వేణుగానలోలలైన గోపికలు పరుగున పోయిన విధమూ, వారిని శ్రీకృష్ణుడు 'ఇలువడి సున్న చేకి' అన్న పద్యంలో అత్తమామలను, భర్తలను, పిల్లలనువదలి వచ్చారేమని ప్రశ్నించిన విధమూ, అందుకు గోపికలు-

'పతిపుత్రాదిక నాయమూర్తి వగుచున్
భాసిల్లు నీయందుఁ ద
త్పతిపుత్రాదిక వాంఛలన్ సలిపి సం
భావించుట న్యాయమే'2

అని చెప్పిన సమాధానమూ, మధుర భక్తిరసమని నిరూపితమైంది. జయదేవుడు గీతగోవిందంలో మధురభక్తినే వర్ణించాడు. ఇంకా విద్యాపతి తన పదావళిలో ఆత్మపరమాత్మల పరంగా రాధాకృష్ణుల శృంగారం వర్ణించాడు. మీరాబాయి, గోదాదేవి మధురభక్తి రస పారవశ్యులు. అన్నమయ్య మధురభక్తి ఈకోవకు చెందిందే. భగవంతుడు వెంకటేశ్వరస్వామి నాయకుడు భక్తుడు నాయిక. వెంకటేశ్వరుడు తానొక్కడే పురుషుడు. మానవకోటి స్త్రీ పురుషుల అనంత శృంగార లీలయే విశ్వం. ఇట్టి అలౌకిక మధుర భావం అన్నమాచార్యుని శృంగార సంకీర్తనలకి బీజం. ఈ అన్నమయ్య శృంగార సంకీర్తనలు వెంకట శైల వల్లభ రతిక్రీడా రహస్యాలని వెల్లడిస్తాయి. ఇలాగే క్షేత్రయ్య తన పదాలలో మువ్వగోపాలుని శృంగారం వర్ణించి తరించాడు. మువ్వగోపాలుడు నాయకుడు. తానే నాయిక క్షేత్రయ్య ఆర్తినివేదనైక భావంతో భగవంతునిపై బాళిగొని, పరమప్రేమను ప్రకటించి పరమాత్మయందు లీనం కావడానికై పడిన తపన స్పష్టమవుతుంది.

ఈసూత్రాలను ననుసరించి రాధాకృష్ణ నాటకంలో మధురభక్తిరస మని నిర్ణయించ వీలవుతుంది. ఇందు ప్రతిపాదిత రసం భక్తి రాధాశృంగారంలో భౌతిక వాంఛలకు ప్రాధాన్యంలేదు. ఆత్మపర మాత్మతో ఐక్యం కావడానికి అవసరమైన అలౌకిక పరమానందమే ఇమిడివుంది. నాటకకర్త అభిప్రాయం కూడా ఇదే. రాధాకృష్ణ నాటకంలోని ప్రస్తావనలో నటీసూత్రధారుల సంభాషణమూలంగా నాటకంలో పరిపోషింపబడిన రసాన్ని గూర్చి వివరించారు నాటకకర్త.

'సూత్రధారుడు -' ఎన్నాళ్ళ కిట్టి నాటకము చదువు భాగ్యము నాకు లభించెను! చదివిన మాత్రముననే భక్త్యావేశము చేఁ బులకితాంగుడనై యానంద బాష్ప పూరిత లోచనుండ నైతిని. ఇంకఁ బ్రదర్శిత మైనచో నీనాటక మెట్లు శోభిల్లునో నేఁ జెప్పఁజాలను.

కలియుగము మాటమఱచి నా కాంత మఱచి
మఱచి నాదైన పురుష జన్మంబు గూడ
వింతగా నేను రాధికా - కాంతనైతి
నవని గ్రంథంబు చేయలేవట్టి దేది?
... ... ... ...

నటి శృంగార రస ప్రధానమా?
సూ శృంగార రసమునకు ముద్దుచెల్లెలైన భక్తిరసము ప్రధానరసగా గలది.
నటి : సరి. సరి. తేజస్తిమిరములవలె నుండు భక్తి శృంగారములు సోదరులెట్లగును? జారిణీ శిఖామణి యనబరగు రాధ భక్తజన గ్రామణి ఎట్లగును?
సూ : ఓసి. ఇటు విను.

కాముకుల గూర్చి శృంగార నాయకంబు
భక్తియగు నది దైవంబు పైని బెట్టఁ
బాలతి తలబెట్ట సుమము ముద్దులకుదగును
దైవ నిర్మాల్య మేని వంద్య మగు నదియె

ఇలాగ భక్తిరసమని స్పష్టంచేశారు నాటకంలో. కనుక రాధాకృష్ణ నాటకంలో భక్తిరసం ప్రతిపాదింప బడింది. రాధా భక్తిరసానికి ఆలంబన విభావం భగవత్స్వరూపుడైన శ్రీకృష్ణుడు బాలకృష్ణుని

(తరువాయి 24వ పేజీలో)

# గ్రంథ సమాలోచన

## శ్రీ రంగధామేశ్వరి

[రచయిత శ్రీ రేగడమిల్లి సత్యమూర్తిగారు. కాపీలకు ఆర్. రాజ్యలక్ష్మిగారు,. మాచవరం, రామచంద్రవరం వెల విద్యార్థులకు 3 రూపాయలు. ఇతరులకు 5 రూపాయలు ]

కొన్ని సంఘటనలు కవినిబట్టి స్ఫూర్తిమంతము లగును మరికొన్ని స్వయంప్రకాశములై దేహళీదత్తదీప న్యాయమున కవులను ప్రకాశింపజేయును కవిప్రతిభ స్వీకృతేతివృత్తమున సుస్పష్టమగును. స్వయంప్రకాశకమగు నితివృత్తమును గ్రహించిన కవిని పరిశీలించుట మిక్కిలి కష్టము అట్టి యితివృత్తమును స్వీకరించి నిర్వహించుటయు కష్టమే. అట్టి సాహసము చేసి 'శ్రీరంగధామేశ్వరి'ని నిర్వహించినవారు శ్రీ రేగడమిల్లి సత్యమూర్తిగారు.

శ్రీరంగధామేశ్వరి ఏడు రంగముల నాటకము ప్రాచీన నాటకాది లక్షణముల కతీతమైనది ఇందు నాయకరాజుల కాలమునాటి వాఙ్మయము యథావకాశముగ సాక్షాత్కరించును అన్నదానశీలియగు తంజావూరు ప్రభువు విజయరాఘవుని పట్టుదల, శ్రీరంగధామేశ్వరి వానిని పరీక్షించి అనుగ్రహించుట ఇందలి ముఖ్యవృత్తము దీని నిర్వహణకై ప్రథమరంగమున విజయరాఘవుని కొలువు, ప్రతిజ్ఞ, ద్వితీయరంగమున బ్రాహ్మణుల గొల్లల సంభాషణవలన విజయరాఘవుని అన్నదానవిషయము, తృతీయ రంగమున విజయరాఘవుని కవితాగోష్ఠి, నాల్గవరంగమున తిండిపోతు బ్రాహ్మణుల సంభాషణ, పంచమరంగమున కాశీరాజు కోరిక, విజయరాఘవుని యన్నదానశీలము, ఆరవ రంగమున గొల్లభామ-బాలుర సంభాషణ, పూజారి ధర్మకర్తల సంభాషణము, ఏడవ రంగమున బ్రాహ్మణుల సంభాషణ, విజయరాఘవుని భక్తి. మున్నగునవి నిర్వహింపబడినవి కథలోని బ్రాహ్మణుల సంభాషణలు వారి పోమరితనమును మిక్కిలిగా వ్యక్తీకరించుచున్నవి. వాస్తవమునకు వాని ప్రయోజనము విజయరాఘవుని యన్నదానమును వ్యక్తీకరించుట. కాని యా ప్రయోజనమును మించుట గమనింపదగియున్నది. మరింత నిశితముగ పరిశీలించినచో సమాజములో నొక వర్ణమువారి యవలక్షణమును (ఉన్నదో - లేనిదో) అతిగా వ్యక్తీకరించుట జరిగిన దనిపించును అది కవిగారి ఉద్దేశము కాకపోయినను, ఆయా సంభాషణ లట్టి యభిప్రాయమును కలిగించును. గొల్లలసంభాషణయు రాజ-రంగాజమ్మలపై పాఠకులకపోహను కల్గించును వారిద్దరిపై నపోహ కల్పించుటకు గొల్లల సంభాషణ నుపయోగించుట ప్రశస్తముగా నగపడదు రాజు రంగాజమ్మల క్రమభావ మున్నను దానిని సామాన్య పాత్రలచే సూచింపజేయుట నాటక నాయకుడగు విజయరాఘవుని యుదాత్తతకు భంజకముగా భావింపవలసివచ్చును అట్లే విజయరాఘవుని కవితాగోష్ఠిలోని కవులు వారి మాటలు వారి యుదాత్తతకు భంజకములా యనిపించును విజయరాఘవుని పాత్రచిత్రణము వలసినంత యుదాత్తముగా లేదు అహంకారిగా, ఆస్థానకవులకడ చేలగా, పరమభక్తుడుగా ఎగుడుదిగుడుగా చిత్రింపబడినాడు గొల్లభామల సంభాషణ (రంగనాథుని సృష్టి యని కవిగారనిరి) అమ్మవారిముక్కెర లేదను విషయమునకై కల్పింపబడవలసిన దానికంటె నధికమైన దనిపించును. మొత్తముమీద ప్రాచీనుల (నాయకరాజుల నాటి) నవీనుల రచనలు (పద్యములు ద్విపదలు) మితిమీరి చోటుచేసికొనిన వనిపించును. కథారచనలో కవి తగినంత శ్రద్ధ చూపలేదని భావింపక తప్పదు.

3 వ పేజీలోని వందిమాగధుల కైవారమున 'అద్యతనభోజా' కవిసమాజభోజ అని పునరుక్తిని కల్గించుట మనోహరముగా లేదు చమత్కృతిప్రవీణ, పూర్ణిమచంద్ర, సత్రాధికారివంటివి అగపడును. సత్రమను పదము తెలుగులో నొక యర్థమును సంస్కృతమున మరొక యర్థమును చెప్పును ఒక భాషలోని యర్థమున మరొక భాషలోని పదముతో సమాసము చేయుట మరింత విచిత్రముగా నగపడును. గంటూనాద మట్టివానిలో నొకటి ముద్రారాక్షసముగా నిట్టివానిని సర్దుకొనవలెను. ఇది మొత్తము మురువది పేజీల గ్రంథము. దీని వెల విద్యార్థులకు మూడు రూపాయలు, ఇతరులకు అయిదు రూపాయలు అనుట మిక్కిలి భారమనిపించును దీనిపై ప్రముఖుల ఉదారములగు నభిప్రాయములు కలవు. ఇట్టి యితివృత్తమును స్వీకరించుట కవికిగల యాంధ్రాభిమానమును ధైర్యమును సూచించును. ఇట్టి ప్రయత్నము సర్వధా మెచ్చదగినదని చెప్పవచ్చును ఒరిజినాలిటీ చాల తక్కువగా నుండి ఇతరుల రచనాభాగములనే ఏర్చికూర్చుట శిల్పరామణీయకత అని అంగీకరించినచో అది యిందు కానవచ్చును. 'చక్కని ప్రదర్శనయోగ్య' మగు నీ నాటకమింకవరకు కెన్నిసార్లు ప్రదర్శింపబడినదో తెలియదు

## భగవాన్ శ్రీ సత్యసాయిబాబా దివ్యలీలాతరంగాలు

[రచయిత : డా.బి.యస్.ఆర్. ఆంజనేయులు. ఎం.ఏ, ఎం.యిడి, పిహెచ్.డి ఎ.ఐ.ఇ. (లండన్) ప్రొఫెసర్ గవర్నమెంటు కాంప్రహెన్సివ్ కాలేజి ఆఫ్ ఎడ్యుకేషను, రాజమండ్రి. ప్రతులకు శ్రీ బి. వెంకటరత్నమ్మ 16-13-10 త్యాగరాజనగర్. రాజమండ్రి. 533101. వెల తెలియదు ]

ఈగ్రంథము భగవాన్ శ్రీసత్యసాయి బాబాగారి 55 వ జన్మదినోత్సవ సందర్భమున పుట్టపర్తిలో జరగిన ప్రపంచసాయి సంస్థల కాన్ఫరెన్సులో శ్రీవారికి సమర్పింపబడినది.

ప్రవేలెత్తి చూపదగిన లవలేశమైన ఏవిధమగు ఆక్షేప - ఆభాసమును లేని ఉత్తమభక్తుడు; దేశీయ విదేశీయ సహస్ర జనానీకముచే అవతారమూర్తిగా ఆరాధింపబడుచున్న మహాయోగి; శ్రీ సత్య సాయిబాబా. అద్భుత సంఘటనలతో నిండిన శ్రీవారి జీవిత విశేషములు, దివ్య లీలలు, ఉపదేశములు అతిసరళమైన భాషలో ఇందు పొందు పఱచబడినవి. విషయగౌరవముతోపాటు శ్రీ ఆంజనేయులుగారి శైలి మనోజ్ఞమై కుతూహలం రేకేత్తిస్తూ పఠితలచే సాంతము చదివింప గలిగియున్నది. సాయిబాబా భక్తులే కాక పరమార్థచింతగలవారెల్లరు పఠింపదగిన మంచిగ్రంథ మిది.

శ్రీ గౌతమ.

( 22 వ పేజీ తరువాయి )

లీలావిలాస సంబంధి కథలు విభావాలు. బాలకృష్ణుని ఆకారాలయందు మనసును లగ్నంచేసిన రాధా చిత్తవృత్తి స్థాయి భావం. అట్టి రాధాచిత్తవృత్తియే భగవద్రతి. ఆసమయంలో రాధకు కలిగిన నేత్రాది వికారాలు అనుభావాలు. ఆమె మనస్సునందు స్ఫురించిన నిర్వేద శంకా హర్షాదులు వ్యభిచారి భావాలు. ఇలాగ రాధా పరమానందస్వరూపమైన అంటే ఆత్మ పరమాత్మయందు ఐక్యంపొందే స్థితి భక్తిరస మని స్పష్టమవుతుంది.

శ్రీకృష్ణుడు జగన్మోహన వేణుగాన లోలుడు. శ్రీకృష్ణునియందు భక్తి ప్రపత్తులు కలిగినది రాధ. రాధాకృష్ణభక్తి అనితర సాధ్యమేకాదు ముగ్ధ మోహనము కూడా. ఆమెభక్తి ఐహిక వాంఛలకు అతీతమై నిష్కళంక మైనది. మధుర భక్తి పరాయణులైన వారందరు భగవంతు డొక్కడే పురుషు డని తక్కిన ప్రాణికోటి అంతా స్త్రీస్వరూప మని నమ్మినవా రన్న విషయం పూర్వోక్తం. ఈసూత్రం రాధాభక్తికికూడా వర్తిస్తుంది. 'మనకాంతుడు తప్ప మరియెవ్వరు (పురుషులు) వున్నారు? ఈ సృష్టిలోని జీవతతి యంతయు స్త్రీ తతియే. అందరకు ఒక్కడే పురుషుడు' అని రాధ సత్యభామతో చెబుతుంది. రాధ ప్రణయం భౌతిక వాంఛలకు అతీతం. కనుకనే ఆమె మనస్సు ఎల్లపుడు బాలకృష్ణునిమీద నేకాని ప్రౌఢుడైన కృష్ణునిమీద లేదు. మధురనుండి వచ్చిన కృష్ణునిం జూచి రాధ 'నన్ను వలపించినవాడు, నా ప్రాణనాథుడు, నా యిష్టదైవము, బృందావనాధీశుడుగాని. మధురాధీశుడు కాడు.' అని వ్యక్తంచేస్తుంది. 'నాదు మగడు ధరణీనాథుడుంగాడు. రాధ మనంబు కొల్లగొన్నట్టి కడుతేత గొల్లవాడు' అని అంటుంది. తనసర్వమూ భగవదర్పణం చేసింది రాధ. తనకుసర్వమూ భగవత్ స్వరూపము. 'నాకు కాంతుడు నాశిరమున ఉన్నాడు కనులందున్నాడు. జిహ్వాయం దున్నాడు. హృదయమునం దున్నాడు. అతండునాలో నున్నాడు. నేను అతనిలో నున్నాను' అని రాధ సత్యకు సమాధానం యిస్తుంది. రాధా భక్తికి పరాంకోటి చతుర్థాంకం. రాధ నిరస్త భూషయై, కాషాయాంబర ధారిణియై, సర్వసంగ పరిత్యాగినియై భగవంతునిలో ఐక్యంపొందడానికై వెళుతూ ఉంటుంది. మధుర అనే చెలికత్తె అనుసరిస్తూ ఉంటుంది. చివరకు యమునా నదిలో అదేసమయంలో ప్రతిబింబిస్తూ వుండిన చంద్రుని గాంచి కృష్ణు డని భ్రమించి అందులో మునిగిపోతుంది. కాబట్టి ఆమెలో ఇహలోక సుఖలోలుపత గాక పారలౌకిక సౌఖ్యమే ప్రధానంగా వున్న దని తెలుస్తుంది. గర్వించిన సత్యభామను కూడ భక్తి మార్గంలోకి తీసికొని రాగలిగిన ఉదాత్త ప్రభావం గలది రాధభక్తి. ఇది మధురభక్తి.

ఇలాగ రాధాకృష్ణ నాటకంలో భక్తి ప్రధాన రసంగాను, శృంగార హాస్య, కరుణ రసాలు అంగరసాలుగాను పానుగంటివారు పోషించారు. ఈ అంగరసాలు ప్రధాన రసమైన భక్తి పరిపోషకాలుగా వున్నాయి. మొదట శృంగారరూపంలో అవతరించి చివరికి క్రమంగా రాధయందు భక్తిగా రూపొందుతుంది. విదూషకుని మాటల్లో ఉచిత రీతిని హాస్య మందించ బడింది. చివరి దశలో భక్తిపరిపూర్ణ యైన రాధ యమునలో దూకినపుడు కరుణరసం పరిపోషింపబడింది. ఇలాగ సందర్భోచితంగా ఈ అంగరసాలచే ప్రధానరసమైన భక్తి రాధాకృష్ణనాటకంలో సముచితరీతిని వుండడం స్పష్ట మవుతుంది.

1. ఆంధ్రపత్రిక-సంవత్సరాది సంచిక (1942-43) పుట 17.
2. పోతన - శ్రీమహాభాగవతము దశమస్కంధము-పద్యం 976, 985

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా, హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది. వెల రు. 20 లు ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము.

రెండవ సంపుటము వాల్యూములును కొలదిగా ఉన్నవి. వెల రు. 20 లు ఎం. ఒ. చేసిన వారికి పైవిధముగనే పంపబడును. వి. పి. పద్ధతి లేదు.

మొదటి సంపుటము ప్రతులు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జే. కాలేజీ,

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.